# యోగమూలము





అనువాదకులు :

శ్రీ పి. బాలయ్యశ్రేష్ఠిగారు, బి. ఏ. బి. ఎల్.

# విజ్ఞప్తి

ఈ యనువాదమును ప్రచురించుటకుగాను ముద్రణ ఖర్చులకు నా మిత్రులును శ్రీమాతారవింద సేవకులును ప్రొద్దుటూరు వాస్తవ్యులునగు శ్రీ కామిశెట్టి అప్పన్నశ్రేష్టిగారు 500 రూప్యములును, శ్రీ మిట్టా బాలవెంకటసుబ్బయ్యశ్రేష్టిగారు 150 రూప్యములు విరాళమిచ్చి సహాయ్యపడినందులకు వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఈ యనువాదములోని భాషాలోపములను, వ్యాకరణదోషములను సవరించి చక్కని ఉపోద్ఘాతమును వ్రాసిపెట్టిన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులగారికిని ఎన్నోవిధముల తోడ్పడిన శ్రీయుతులు కె. నరసారెడ్డి, శ్రీ ఎ. నీలకంఠశాస్త్రిగార్లకును నా వందనములు.

ప్రొద్దుటూరు
15—8—1948

పి. బాలయ్యశ్రేష్టి
అనువాదకులు

# వి ష య సూ చి క

# ఉపోద్ఘాతము

శ్రీయాతనుఁడు — లోకబాంధవునితో బోల్పదగిన పదార్థము మరియొకటిలేదు. అతని కతడేసాటి. మరియొక పదార్థముతో బోల్చుటకై వ్యర్థప్రయత్నమొనరించువారు మందులు. ఉన్మాదులు. శ్రీఅరవిందులతో మరియొకరికి బోలికలేదు. జీవితమునందలి వైవిధ్యము—దానిలోని గభీరత—తెగువ—సాహసము—అన్నిటిలో వారికి వారేసాటి. ఆయన ప్రాచ్య పాశ్చాత్యములకు వజ్రమయసేతువు. రాజకీయవాదుల కొలతలకు మీరిన భౌతికవాది. మహర్షులకు మకుటాయమానుడగుఋషి. మౌని. వారిజీవితము. భూత. భవిష్యద్వర్తమానముల సంకలనము. ఆకాశమువలె వ్యాపకములు.

ప్రాచ్య పాశ్చాత్య వాఙ్మయములలో వారభ్యసింపని గణనీయమగు వాఙ్మయములేదు. అంతుచూడని యభ్యాసములేదు. సంస్కృతము వారి ముంజేతి పలుకు చిలక. ఆంగ్లము వారి పాదదాసి. శంకరుల నిశిత మేధస్సు—రామానుజుల హృదయవాదము—మధ్వాచార్యుల భక్తివైవిధ్యము—అదియిదననేల సమస్తము నా మహర్షియగాధ సత్యమునందోతప్రోతమై యున్నది. వారి కవితను జదువునపుడు ప్రపంచమహాకవులందరు నొకటియై నిలిచి పాడినట్లుండును. ఆమహర్షి తర్కనైపుణియందగాధసముద్రములు. నత్యున్నతమగు పర్వతశ్రేణులు. శ్రీ అరవింద

వాఙ్మయసేవనమే యొక తపస్సు. వారి 'సావిత్రి' వంటి గ్రంథమును ప్రపంచమర్థముచేసికొనుటకైనను - యిక నెంతకాలము పట్టునో!

రాజకీయరంగములో శ్రీఅరవిందులు గృషిసల్పినది కొంత కాలము మాత్రమే. అయిన నేమి? రవియస్తమింపని సామ్రాజ్య మానాడు ఉట్టుటలూగినది. వారి సిద్ధాంతములనేక రాజకీయవాదులకు మనన మంత్రములైనవి. తిలకు యుగమునందు స్వారాజ్యరథమహారథుడు శ్రీఅరవిందులే యన్నచో నుత్ప్రేక్షయేమికలదు? వారి రాజకీయ సిద్ధాంతముల నర్థమొనరించుటకు సాధారణ రాజకీయవాదులు చాలరు. వారి భౌతికవాదముగూడ నొక తపస్సే. తపస్సులేని వారికి శ్రీవారి రాజకీయభాషకూడ నర్థముకాదు. అనేకులురాజకీయజ్ఞులు "నేటి మహర్షులు, కేవలము సోమారు" లనుట నేను వినియున్నాను. వారేమియు "పని" చేయుటలేదట, ఈ 'పని' శబ్దమునకు వారి వ్యాఖ్యానమేమో నాకర్థమగుటలేదు, కాలుచేతులు కదిలించుటయా? లేక గుండెజబ్బువచ్చువరకు వాగుటయా? భక్తిజ్ఞానములచే సమ్మిశ్రితము కాని కర్మ కర్మకానేకాదు. చీకటియందు దడవులాట. నిజముగా బని చేయుచున్నది మహర్షులే, దైవబల పరిపుష్టముగాని కర్మ కర్మయేకాదు.

శ్రీఅరవిందుల యోగము తమకొఱకు గాదు, లోకముకొఱకు. లోకము కొఱకు గాదు. భగవన్నిర్దిష్టమగు ధర్మనిర్వహణమునకు. వారి యోగముస్వార్థమైనచో నింత కష్టపడవలసిన పనిలేదు. నాడు ఆలీపూరు జైలునందే వారికి శ్రీకృష్ణపరమాత్మ దర్శనమైనది.

శ్రీవారి యోగము కేవలము క్రొత్తదియునుకాదు, ప్రాతదని చెప్పలేము కాని, చిరంతన మహర్షిసమ్మతమైనది. సామ్యము వారి ప్రధానాశయము. భక్తి జ్ఞాన కర్మల సమ్మేళనమే వారి పూర్ణయోగము. పృధివీ తత్త్వములోనికి విజ్ఞానమయ సత్యావరోహణము వారి లక్ష్యము. ఇది యింతకు ముందటి ఋషులు ప్రయత్నింపని సాహసప్రయత్నము. ప్రపంచమంతయు "నమృతపుత్రులచే, నిండిపోవలె' ననుట వారి యభ్యూహ. ఈ యసాధ్యమును సాధ్యమొనరించెడు శ్రీవారి నను కొన్నప్పుడంతయు నాకు రామాయణమునందలి విశ్వామిత్రుడు జ్ఞాపకమగా నగుపడుచుండును.

శ్రీవారి దేశభక్తియగాథమైనది. ఆర్యజాతి వారికి ప్రాణము. శ్రీఅరవిందుల ప్రతీకము భారతదేశమే. శ్రీవారి ''దుర్గాస్తోత్రము', ను చదివినప్పుడెవడును వారి దేశభక్తికి పులకింపకమానడు. కాని యది సంకుచితముకాదు; బాహ్యస్వరూపమాత్ర విశ్రాంతముకాదు. ఆదేశభక్తి చంద్రికాలోకము, ప్రపంచమంతయు వారి దేశభక్తిలోనున్నది.

పూర్వపరిపక్షణ్ణమగు నే మార్గమును శ్రీఅరవిందులు నిరసించి నదిలేదు. తప్పుగా వెలకట్టినదిలేదు. వారి తర్కసముద్రమునం దన్ని సిద్ధాంతములును న్యూనాధికతలతో మెఱయు రత్నములవలె ప్రకాశించు చున్నవి. ఆజ్యోతిస్సునకు నమస్కారము.

శ్రీఅరవిందవాఙ్మయ మనంతముగానున్నది. ప్రతిగ్రంథములోని ప్రతి వాక్యమును సర్వలక్షణశోభితము. ఆ గ్రంథములలో ''బేసిస్ ఆఫ్ యోగ" అను దానికి యీ ''యోగమూల'' మను గ్రంథ మాంధ్రాను

వాదము. యోగసాధకులు తమ సాధనలయందు కలిగిన సందేహములను శ్రీవారికివ్రాపికొనగా వారు లేఖల రూపమున నిచ్చిన యుత్తరము లిందలివిషయము. అనుభవదృష్టితో నీగ్రంథమెంత మహత్తరమైనదో నే జెప్పవలపినదిలేదు. దీని యాంధ్రానువాదకులు నామిత్రులు, భక్తులు శ్రీబాలయ్య శ్రేష్టిగారు. వారు తాముబూనుకొన్న కార్యమును దగిన భక్తిశ్రద్ధలతో నిర్వహించినారు, అధికారములేని యవకతవకపని యిందులేదు. గ్రంథకర్త శ్రీయరవిందుల పాదరేణువు. ఈ యాంధ్రీకరణమున దపస్సుగా నిర్వహింపబడిన యిందలి భాష తెనుగుతనము చెడని తెనుగు. నాదృష్టితో ననువాదములిట్లే యుండవలెను. ఇంతవరకును పరాశక్తి మాతృప్రేరణయట్టిది. ఆమె యెవ్వరి నెంతవారినైనను జేయగలదు. ఇట్టి ప్రయత్నము లింకను జరిగి శ్రీఅరవిందుల వాఙ్మయమంతయు నాంధ్రములోకి రావలెను. ఆప్రయత్నమున కృషిచేయుచున్నవారు—చేయించుచున్నవారు మామిత్రులు, సహృదయులు శ్రీచతుర్వేదుల వేంకటకృష్ణయ్యగారు. వారి కృషి సంపూర్ణముగ ఫలించుగాక.

ప్రొద్దుటూరు,
24-3-1947

ఇట్లు,
పుట్టపర్తి నారాయణాచార్లు

నెలకొల్పుటయే. అట్టిశాంతి లేకున్నను నీకనుభవములు కలుగవ చ్చును. అయితే యేవికూడ నీలో స్థిరముగ నెలకొనజాలవు. నిశ్శ బ్దమైన మనస్సునందే దివ్యసత్యచైతన్యము నిర్మింపబడుటకు వీలగును.

అచంచలమైన మనస్సనగా సంకల్ప వికల్పంబులు, మనో వృత్తులు లేకుండుటగాదు. కాని సముద్రముమీద తరంగముల వగిది మనస్సుయొక్క యుపరిభాగమునందే యవి సంచారము కలిగియుండును.

సాక్షిస్వరూపుడుగా నుండి నీలో నున్న పురుషుడట్టి మనో వ్యాపారంబులతో నిర్లిప్తుడై తెరపై నాడు బొమ్మలదిలకించు ప్రేక్ష కుని చందంబున వీక్షించుచు, న్యాయాధిపతి తీరున విమర్శజేయుచు, సత్యానుభవంబుల మాత్రమే యామోదించుచు, తదితరములైన వానిని తిరస్కరించుచునుండును.

సాధు సరళత్వములు గల మనస్సు మంచిదేగాని దివ్యసత్యశక్తుల యనుసంధానము పట్ల మాత్రమే యట్టి సాధు సరళత్వములను ప్రదర్శించుటకు హెచ్చరిక గలిగియుండవలెను. నికృష్ట స్వభావమునుండి యుద్భవిల్లు తుచ్ఛ సూచనల పట్లను, నీచ ప్రేరేపణలపట్లను భీకర పటాటోపము జూపక సరళత్వమును జూపిన యెడల సాధనలో క్రమాభివృద్ధిని బొందజాలవు. లేనియెడల ప్రతి

పక్ష శక్తులు నిన్ను యోగమార్గమునకు దూరస్థునిగా జేసి పాతాళ మునకు ముంచును.

అచల స్థిరత్వము పడసిన మనస్సును, బాహ్యస్వభావమునకు విలక్షణుడై సత్యజ్ఞానములచే నాకర్షింపబడిన యంతరాత్మయొక్క సతతజ్ఞానమును ప్రసాదింపుమని తల్లికి మొరలిడి యాకాంక్షింపుము.

యోగసాధనకు ప్రతిబంధకములైన శక్తులు నికృష్ట మనః ప్రాణ శరీర స్వభావములు, ప్రతికూల శక్తులైన సూక్ష్మ మనః ప్రాణ భౌతిక ప్రపంచములు వీని వెనుకనుండి వీనికి సహాయభూత ములుగా బనిచేయు చుండును. ఏకదీక్షతో నీ హృదయము, ఏకాగ్ర తతో నీ మనస్సు భగవంతుని పొత్తుగోరి తీవ్రముగా నాకాంక్షించిన యనంతరమే యా ప్రబల శత్రువుల నిరోధించగలవు.

నిశ్చల నీరవత యెల్లప్పుడు సముచిత మైనది. నిశ్చలనీర వత యనగా శూన్యమైన మనస్సని నా నిర్వచనము గాదు. కలవర పరచు నాలోచనలచే తబ్బిబ్బు పడక స్థిర మనస్సు గలిగి నీ స్వభావ మును బవిత్రము చేయునట్టి దివ్యశక్తిని సంతోషోత్సాహములతో నుస్మీ లన మొనర్చునట్టి మనస్సే నిశ్చల నీరవతగల మనస్సు. నీ పైకి నలవాటుగా దాడివెడలి కలవరపరచు నాలోచనల నుండియు, నపోహ భావముల నుండియు, చిత్రభ్రమలనుండియు, నపసవ్యవృత్తులనుండియు

విముక్తి గాంచుటకు విశేషముగా ప్రయత్నించుము. ఇవి స్వభావ మును జీకాకుచేసి మలినపఱచును. అందువలన నీలో మాతృశక్తి పనిచేయుటకు గష్టతరముగానుండును. మనస్సు అచలత్వమొంది శాంతి వహించినపుడు, మాతృశక్తి సులభముగా బనిచేయ గలుగును. తబ్బిబ్బుపడక, జుగుప్సజెందక, నీ స్వభావములో బరివర్తనార్హములైన యంశముల గుర్తించిన యెడల బరివర్తనము సులభసాధ్యమగును.

శూన్యమనస్సునకు స్థిరతగాంచిన మనస్సునకు భేదము గలదు. మనస్సు శూన్యావస్థలో నున్నప్పు డాలోచనగాని, భావముగాని, యేలాటి మనస్పంచలనములేక భావాకృతి బొందని వస్తు గ్రహణశక్తి మాత్రము గలిగి యుండును. స్థిరత మనోమయ పురుష స్వరూపము. నిశ్చలత, యచంచలత పై స్వరూపలక్షణములు. ఎట్టి విషమావస్థలందుగూడ నా స్థిరత్వము చలింపదు. ఒకవేళ సంకల్పములు క్రియలు గలిగినను అవి మనస్సునం దుద్భవించక, చలనములేని యాకాశము నందు బక్షుల సంచారము పగిది మనోవీధియందు బాహ్యమునుండి ప్రవేశించి, రాక పోకలు గలిగియుండును. గగనమునందు బక్షులు విహారమొనర్చిన గుర్తు లేవిధముగ లేకుండునో తద్విధముగనే ప్రశాంతమైన మనస్సునందు సంచరించిన యాలోచనలు, క్రియలు స్థిరత్వమునకు భంగము గలిగింప జాలవు. తుదకవి సంచారము చేసిన జాడలు గూడ నగుపడవు. సహస్ర చిత్ర విచిత్రములుగాని లేక ఘోరప్రమాద కార్యములుగాని తటస్థించినను ప్రశాంతమైన స్థిరత్వము చలింపదు. ఆ శాంతి

శాశ్వతమైనది, అభేద్యమైనది. ఇట్టి శాంతిపూరితమైన మనస్సు మహాశక్తి సామర్థ్యములతో గార్యకలాపములందు బ్రవర్తింపగలదు. అట్టి తరుణంబులందు గూడ దన స్థిరత్వమును గోల్పోవక, యహంకారజన్యములైన సర్వప్రయత్నములను ద్యజించి, పైనుండి ప్రవహించు దివ్య సందేశముల మాత్రమే స్వీకరించుచు, అట్టి దివ్య సందేశముల కున్నది యున్నట్లు ఉద్రేకములేని ప్రశాంతమైన మనస్సుతో గల్పనారహితమైన రూపనామము లొసంగుచుండును. అట్టి సత్యతేజశ్శక్త్యానందములలో నోలలాడుచున్నను దన స్థిరత్వము చలింపదు.

చలనము లేక యాలోచనలనుండి విముక్తినొంది స్థిరత్వము నొందిన మనస్సు వాంఛింపదగిన విషయము. ఏలనన మనస్సు ప్రశాంతముగా నున్నప్పుడే యూర్ధ్వమునుండి విశాలమైన శాంతి నీ లోని కవరోహించును. అట్టి విశాల శాంతిలో నున్నప్పుడే; నీ మనస్సు ఉపరిభాగమున నంతట నిండి వ్యాపించియున్న రూపనామ క్రియలు లేనట్టి యాత్మసాక్షాత్కారము బొందనగును. మనస్సు ప్రశాంతముగా నుంచ బ్రయత్నించునపుడు కామోద్భూతములైన తలంపులు ఆ స్థాన మధిష్టింప బరుగిడును. లేక నిరుపయోగమైన వ్యర్థాలోచన లప్రయత్నముగా బ్రవహింప మొదలిడును. అట్టి సమయములందు సాధకు డప్రమత్తుడై వెలుపలనుండి దండెత్తివచ్చు నీ ప్రతిపక్షుల దూరముగా బారదోలవలెను. అందుచే ధ్యాన సంధ్యా

సమయముల యందైనను మనస్సు చలనము నొందకుండ, ప్రాణము తబ్బిబ్బులాడకుండ, ప్రాణమనస్సులందు శాంతి నెలకొల్పనగును. కామనారహితమైన దృఢసంకల్పము నీకు గల్గిన నిది సులభసాధ్యమగును. పురుషుని సంకల్పమే యీ కామవర్జిత సంకల్పము. ఈ పురుషుడు మనోవికారములచే మఱుగుబడి యున్నాడు వికారములణగి మనస్సు మౌనము దాల్చినగాని నీకీ పురుషుడు గోచరముగాడు. పురుషుడు ప్రకృతిచేయు కార్యకలాపములకు విలక్షణుడైన శాంతమూర్తి.

స్థిరత్వము, నిలకడ, యాత్మరతితో గూడిన యచంచల మనస్సు, బాహ్యప్రకృతి బంధములనుండి యంతర్యామియైన పురుషుని విడుదల, యోగసాధనకు సహాయకారులేగాక యపరిత్యాజ్యములై యున్నవి. తండోపతండములుగా దాడి వెడలి నిన్ను ముంచివేయు తలంపులకు గోరికలకు బానిసవైతివేని యాత్మజ్ఞానమునందు స్థిరమతివై యుండజాలవు. కనుక వానిచిక్కు విడిపించుకొని దూరస్థుడవై నిలబడి 'అవి వేఱు, నేను వేఱు' అను భావము నందుండుట తప్పని సాధన.

నీ నిజస్వరూపము గనుగొని నీ స్వభావమునందు దానిని ప్రతిష్ఠించుటకు రెండు విషయములు ముఖ్యములు. హృదయపీఠము వెనుక నుపవిష్టుడైయున్న చైత్య పురుషోపలబ్ధి మొదటిది. ప్రకృతి

కార మేమన భగవంతునియందు కృతజ్ఞతగలిగి, యేశక్తి నిన్ననుసంధించినదో యాశక్తి నీలో నభివృద్ధి బొంద నర్హమైన యంశము లను ప్రజ్వలింపజేయుటకు నీ వనుమతించి యాశక్తి కుస్మీలుడవై యుండవలెను. ఒక్క గడియలో నీ స్వభావము సంపూర్ణముగా శుద్ధి గాజాలదు. ఆ శుద్ధి సంస్కారము క్రమక్రమముగా నంత స్థులు గలిగి దీర్ఘకాలమునకుగాని ప్రవర్ధమానము గాజాలదు. ఇప్పుడు నీ యనుభవమునకు వచ్చినది యక్షరాభ్యాసోపదేశము మాత్రమే. ఈ యనుభవము నూతన చైతన్యమునకు బునాది వంటిది. ఈ నూతన చైతన్యములో శుద్ధి సంస్కారము సులభము. ఈ యను భవము తనంతకు దాను స్వతస్సిద్ధముగా విన్ననుసంధించుచున్నది. కాన నట్టిది నీ మనస్సంకల్పావేగ నిర్మాణము గాదను విష యము నిర్వివాదాంశము. ఈ మనస్సంకల్పావేగముల కతీతములుగా నుండు దివ్యసత్యమునుండి సెలయేటిధారవలె నీ యనుభవము పొంగివచ్చుచున్నది.

సంశయములను అపనమ్మకములను దిరస్కరించుట తలంపు లపై స్వాధీనత గల్గినట్లు భావించవలసినదేగాని యోగమున కది చాలదు. సంకల్పములపైననే గాక కామోద్రేకమైన విషయవాంఛల పైనను మఱియు శరీరచేష్టలపైనను స్వాధీన మత్యవసరము. తన తలంపులకు దాను యజమానుడు గానియెడల బూర్ణమనోమయ పురు షుడు గానేరడు. మనోమయపురుషుడు సాక్షి, అనుమంతుడు,

ఈశ్వరుడు. తనకువచ్చు నాలోచనలను సాక్షిపగిది వీక్షించుచు, న్యాయాధిపతి చందంబున విమర్శించి తీర్పుజెప్పుచు, నీశ్వరునివలె దాను శాసించుచుండును. లేనిచో మితిమీరి చెలరేగిన సంకల్ప వికల్పములచే నలుదిక్కులకు నీవు "టెన్నీసు" బంతి చందం బున నీడ్చుకొని పోబడుదువు. తుపాను చెలరేగిన సముద్రములో జుక్కాని లేని యోడ తబ్బిబ్బుపడు విధమున గామ మోహము లను తుపానులో జీవుడు చిక్కి గిజగిజలాడును, లేక మాంద్యము నకుగాని శరీర ప్రేరేపణలకుగాని బానిసయైన గావచ్చును. ఇట్టి లక్షణములు మనోమయపురుష లక్షణములు గావు. ఈ విజయము కష్టతరమని నాకు దెలియును, ఎందుకన మనుజుడు మనోమయ ప్రకృతియొక్క శిశువు. అందువలన దన మనోవ్యాపారములలో లీనుడై, మనస్సను సుడిగుండములో జిక్కి గట్టునకు త్వరలో రా జాలకున్నాడు. తన దేహముపై గొంతవఱకు నధికారమును బ్రయో గించి, దాని చేష్టలను దన స్వాధీనములోనికి దీసికొని రాగలడు. కొంతప్రయాసచేత గామ మోహములను దన మనో దార్ఢ్యముచే జయించగలడు. ఐతే సుడిగుండములో గిరగిర తిరుగులాడు నీటి చందంబున మనస్సనెడి సుడిగుండములో జెలరేగు నాలోచనల పై నధికారప్రయోగము మనుజునకు సులభసాధ్యము గాదు. ఐన నది సాధన కతీతమైన విషయముగాదు. పరిపక్వము చెందిన మనుజు లేదో యొక విధమున గొన్ని వేళలందు గాని, కొన్ని సందర్భము లందుగాని, సాక్షి స్వరూపుడుగానుండి వీక్షించుచు, విమర్శించుచు,

శాసించుచు నుండునట్టి క్రియారహితమైన మనోభాగము వేఱనియు, యంత్రము పగిది యాలోచనల నిర్మించు క్రియాసహితమైన మనోభాగము వేఱనియు, విభజించియున్నారు. అట్టి సాక్షి స్వరూపమైన మనస్సు గలవాడే స్వారాజ్యమున కర్హుడు. వాడే సామ్రాజ్యాధిపతి.

యోగి యింతటితో దృప్తి జెందక యింకను ముందుకు సాగును. తన మనస్సునకు దాను ప్రభువై దానిలో నొక విధమున నివసించుచున్నను, దానినుండి విడివడి దాని యుపరిభాగమునగాని, దాని వెనుకభాగమునగాని స్వతంత్రుడై యుండును. ఆతనికి మనస్సు ఆలోచనల నిర్మించు యంత్రశాలవలె నెంతమాత్రము గన్పట్టదు. అవి బాహ్యము నుండిగాని, విశ్వమనస్సు నుండిగాని, విశ్వచేతనమునుండిగాని, వచ్చుచున్నట్లును వాని రూపనామక్రియలు మనలో బొందుచున్నట్లును నాతడు గుర్తెరుంగును. మన మనస్సు ముఖ్యతత్వమే మన తరలి పైబడివచ్చు నాలోచనాతరంగముల నొప్పుకొని యామోదించుటయో, లేక తిరస్కరించి బహిష్కరించుటయో, యైయున్నది.

మనోమయ పురుషుని సాధ్యత లపారములు. తన గృహమందు దాను విర్లప్తుడైన సాక్షిభూతుడుగాను, ప్రభువుగాను నుండవచ్చును. ఎవ్వరికి బూర్ణవిశ్వాసము, నమ్మకము, దృఢనిశ్చయము

పట్టుదలగలదో వారు వారి మనస్సులపైన దిన దిన ప్రవర్ధమాన మగు యాజమాన్య స్వాతంత్ర్యముల బొందగల్గుదురు.

* * *

చలనములేని మనస్సు మొదటి మెట్టు. నిశ్చల నీరవత రెండవ సోపానము. అచంచల మనస్సనగా దనకు గల్గెడు సంకల్పములు బాహ్యమునుండి తన మానసాకాశమునందు బ్రవేశించు చున్నవని యెఱుకగలిగి, యవి తనవి గావను భావనగలిగి నిర్లిప్తముగా నుండునది. నిర్జన ప్రదేశము ద్వారా బాటసారులు సాగిపోవు చందంబున నాలోచనలు మనోవృత్తులు నచంచలమగు మనోద్వారము గుండ బ్రవేశించి వెడలిపోవుచుండును. అట్టి యచంచల మనస్సు వానిని గమనింపవచ్చును; గమనింపక పోవచ్చును; ఎట్లయిన నది క్రియకు బూనుకొనదు. తన యచంచలతను గోల్పోదు. అచంచలతకంటె నిశ్చల నీరవత యతిశయమైనది. అంతర్మనస్సు నుండి యాలోచనల నామూలాగ్రముగా నిర్మూలనము జేసి మౌనముద్రను వేసినగాని నిశ్చలత నీరవత నీవు పొందజాలవు. అట్టిది యూర్ధ్వమునుండి నీలోనికి నవరోహించి నీలో నెలకొనవలెను. ఆ నిశ్చల నీరవత పైనుండి క్రిందికివచ్చి ప్రవేశించి నిన్ను స్వాధీనపరచుకొనుటయో లేక నలుదిక్కులు వ్యాపించి నీ వ్యక్తిగత చైతన్యమును విశాలవిశ్వాతీత ప్రశాంతిలో లీనము చేయుటయో యగును.

* * *

శాంతి, స్థిరత, అచంచలత, నిశ్చల నీరవత యను పదముల నిర్వచించుట యతి సులభముగాదు. అతిసూక్ష్మార్థ భేదములు గలవు.

శాంతి యన నారాటము తబ్బిబ్బు పరువులాట లేకుండుట.

స్థిరత యనగా నంతకంటె నారాటములేని యవస్థ. ఎట్టి గందరగోళము గూడ చలింపజేయని యవస్థ. శాంతికంటె దక్కువ శూన్యావస్థ. అచంచలతకంటె నెక్కువ సారభూతమైన యవస్థ. ఈ స్థితియందు సమన్వయపూరితమగు విశ్రాంతి, విముక్తి భావములు గల్గును. నిశ్చల నీరవతావస్థయందు మనఃప్రాణంబులు చలింపక యపార స్థిరత్వముగల్గి యెట్టి చలనమునకు గూడ నభేద్యముగా నుండును.

అచంచలతను విడనాడవలదు. కొలదికాల మది శూన్యావస్థ యైనను దీనత్వముచెందకుము. చైతన్య మొక పాత్రవంటిది. నూతన వస్తువులతో ఆ పాత్రను నింపవలెనన్న బాత్రలో నున్నట్టి క్రుగ్గి కుళ్ళిపోయిన వస్తువుల నెట్లు క్రిందికి దొర్లించవలెనో యట్లు నీ చైతన్యములో నున్న దుర్విషయముల మొదట బారదోలవలెను. క్రొత్తవగు నిత్యసత్య పవిత్రవిషయములు నీ చైతన్యమునకు లభ్య పడువరకు నీ మనస్సు శూన్యావస్థలో గొంత కాల ముండవలసినది

యవసరము. ఐతే పారదోలిన మలినవిషయములతో దిరిగి నీ చైతన్యమును నింపకుండ జాగరూకుడవై హెచ్చరిక గలిగి యుండుము. సత్యానుభవములు చేకూరువరకు వేచియుండుము. ఊర్ధ్వమున కుసిమ్మలుడవై, నెమ్మదిగా, స్తిమితముగా తత్తరపాటులేని యావేశముతో శాంతిని బ్రసాదింపుమని బ్రార్థింపుము. శాంతిచేకూరిన యనంతర మానంద సాన్నిధ్యముల కొఱకు నభిలషింపుము.

* * *

స్థిరతనిర్వీర్యావస్థగా బాహ్యాదృశ్యమునకు మొదట గనుపించినను దాని యుపలబ్ధి మహాకష్టతరము. అది లభ్యపడిన యెడల సాధనలో గొప్ప యభివృద్ధి బొందినట్లు భావింపుము. వాస్తవముగా స్థిరత శూన్యావస్థగాదు. సత్పురుషుని స్వభావమే యది. దివ్య చైతన్యమునకు జక్కని పునాదియైయున్నది. ఇతర దివ్య విభూతులు నభిలషించి బొందినను దీనిని మాత్రము విడువరాదు. ఈ యస్తిభారము లేనియెడల జ్ఞాన శక్త్యానందములు నీకు బ్రాప్తించినను నవి బహుకాలము నిలువజాలవు. సత్పురుషుని శాంతి దివ్య పవిత్రతలు నీలో శాశ్వతముగా నాటుకొననంతవఱకు ఆ జ్ఞానశక్త్యానందములు పెడముఖములై యుండును. దివ్య చైతన్యేతర శక్తులను బొందుటకు స్తిమితముగా దీవ్రముగా నాకాంక్షింపుము. నీ యుత్కాంక్ష గాఢముగాను, దీవ్రముగాను నెమ్మదిగాను నుండవలెను. ఐతే యుద్వేగముగాని త్రొక్కులాటగాని యారాటముగాని యుండ గూడదు.

అచంచల మనస్సునందే మఱియు నట్టి సత్తలయందే విజ్ఞానమయ సత్యము తన నిజసృష్టిని జేయగల్గును.

* * *

సాధనలో ననుభవము మనఃకక్ష్యయందు ప్రారంభమగును. ఇట్టి యనుభవము సరియైనదిగాను సత్యమైనదిగాను నుండుట యత్యావసరము. ఆత్మ జిజ్ఞాస నీడేర్చు పట్టుదలగల మనస్సు, భగవత్సాక్షాత్కారము కొఱకు నావేదన పడి పరితపించగల హృదయము, యోగరథమును నడిపించు జంట గుఱ్ఱములు. శాంతి స్థిరత పవిత్రతలు యోగారంభములో ముఖ్యముగా సాధించి పొందదగిన విషయములు. ప్రథమములో సూక్ష్మప్రపంచముల దృశ్యము నాద ...ందు కళల యనుభవములకంటె శాంతి స్థిరతోపలబ్ధి ముఖ్యావశ్య... శుద్ధి సంస్కారము, స్థిరత్వము యోగమునకు రక్తనాళ...ు వంటివి. వీని యుపలబ్ధి లేని వారికి నాద బిందు కళల యను...మొకవేళ కలిగినను గలుగవచ్చును. ఐతే యిట్టి యనుభవ...ములు తబ్బిబ్బుపడు మలిన చైతన్యమునందు బొడకట్టుటచే మాలిన్యముతో గూడుకొని మురికిగుంటలోని సూర్యప్రతిబింబమువలె నవకతవకలు గల్గియుండును.

ప్రథమములో శాంతి స్థిరతలు సర్వకాలములందు తైలధారగా ...ాంచవు. అవి రాంత్రింబవళ్ళవలె వచ్చుచు బోవుచుండును. ...ారణముగా దీర్ఘకాలమునకుగాని యవి నీ స్వభావములో స్థిరప

దవు. కనుక నీ వాతురతనొంది విసుగునొందక, యోర్పుతో బట్టు విడువక సాధన సాగింపుము. నీకు శాంతి స్థిరతలకంటె నతిశయములైన యనుభవములు కావలెనన్న నీ యంతస్సత్తను సంపూర్ణముగా నున్మీలన మొనర్చి పరాశక్తి నీలో బనిచేయుచున్నదను నెఱుకగలిగి యుండుము. వానికొరకై గాఢముగా త్రికరణ శుద్ధి గలిగి త్రొక్కులాటలేక యాకాంక్షింపుము. అవి తప్పక నీకు సిద్ధింపగలవు.

* * *

తుట్టతుదకు సాధనయొక్క పునాది నీలో నేర్పడినది. ఈ శాంతిస్థిరత శరణాగతులు మూడును ఆధ్యాత్మిక శక్తులగు జ్ఞానానంద బలములను బొందుటకు జక్కని వాతావరణములుగా నున్నవి. అట్టిది పూర్తి గానిమ్ము.

కార్యరంగములో నున్నప్పు డీశాంతి నీయందు నుండదు. ఏలయన నది నీ మనోకక్షలయందు మాత్రమే ప్రసరించినది. అదియు నిప్పుడిప్పుడే నీకు లభ్యపడినది. ఈ నూతనచైతన్య మభివృద్ధినొంది పూర్ణస్వరూపము దాల్చి నీ ప్రాణభౌతిక సత్తల వశపఱచుకొన్న తరువాత నీ లోపమంతరించును. నీ మనఃకక్ష్యయం దనుభవించుచున్న యచలత్వమునొందిన చైతన్యశాంతి స్థిరత్వ మొందుటయేగాక విశాలముగా గూడ బరిణమించవలెను. అట్టి సర్వవ్యాపకమైన స్థిరతలో నీవును సర్వప్రపంచములును నోలలాడుచున్నట్లు నీవు

భావించవలెను. ఇట్టి యనుభవము లౌకికవ్యాపారములందు నీకు శాంతి స్థిరతల జేకూర్చుట కొఱకు సహాయ్య మిడును.

పిండికొలది రొట్టెయన్నట్లు నీ చైతన్యము విశాలమగు కొలది భగవచ్ఛక్తిని నూర్ధ్వమునుండి పొందగలవు. పరాశక్తి నీలో నవరోహించి శాంతిజ్ఞాన తేజోబలముల నీ యాధారములోనికి దెచ్చును. నీ సంకుచితాల్పభావములకు గారణభూతము నీ స్థూల భౌతిక మనస్సు. ఈ విశాల చైతన్య తేజము లూర్ధ్వమునుండి నీలో జొరబడి నీ స్వభావమును వశపరచుకొన్నప్పుడీ భౌతిక సంకుచిత మనస్సు గూడ విశాల మగును.

భౌతిక మాంద్యముచే నీవు పొందు బాధగూడ బైనుండి బలము నీ యాధారములోనికి దొర్లివచ్చినప్పుడది కృశించి మాయ మగును.

అచలుడవై యుండుము. ఉన్మీలుడవు గమ్ము. శాంతిస్థిరతల బ్రసాదింపుమనియు, నీ చైతన్యమును విశాలమొనర్చుమనియు, నట్టి చైతన్యమును బ్రకృతము భరించి జీర్ణించుకోగల తేజోబలముల ననుగ్రహించుమనియు బరాశక్తికి బ్రణమిల్లి ప్రార్థించుము. త్రొక్కులాటతో నాత్రపడక మెలకువగలిగి యుండుము. లేనియెడల నీ వింతకుమున్నె నీ ప్రాణసత్తలో బొందిన శాంతిసమత్వములు చిందర

వందర గాగలవు. ఉత్తీర్ణత పొందగల నను దృఢమైన నమ్మ్రకము గలిగి శక్తి తన కార్యమును నిర్వర్తించుటకు నవకాశ మిమ్ము.

* * *

ఆకాంక్షింపుము. సరియైనభావములో నేకాగ్రత గలిగి యుండుము. కష్టపరంపర లెన్నియున్నను నీ నియమిత గమ్యస్థానము చేరగలవు.

నీలో సత్యదాయకమై శాంతిస్వరూపముగా నుండుదానిని గను గొని, యదియే నీ నిజస్వరూప మని భావించి, దానియందే మని యుండుము. తదితరములైన వన్నియు నీ నిజాత్మ గాజాలవని అవి నీటిమీద బుగ్గలచందమున జర్విత చర్వణములై యుపరిభాగ మున నానారూపములుగా మారు క్రియలని గ్రహించుము. నీ నిజాత్మ బహిర్గత మగుకొలది నీ యనాత్మ బుద్బుదరూపము లంత ర్ధాన మొందుచుండును.

నిజాత్మాభ్యుదయమున కమృతోపమానమైన సదుపాయము శాంతి యొక్కటియే. కలతనొందు మనస్సును కఠినకష్టముచే బరధ్యాన మొనర్చి కొంత శాంతి బడయ వీలగును గాని యది తాత్కాలికమైన చికిత్స. కష్ట మనవసరమని నా వాదము గాదు. సత్తయొక్క వివిధ కక్ష్యలను సమత్వముగా నుంచుటకు గొంత పరిశ్రమ యవసరము. నీ శిరస్సు చుట్టును బైనను ఉన్న శాంతి ననుభవమునకు దెచ్చ

త్మికశక్తి బలము లాదిగాగల యోగసంపత్తుల ప్రసాదింపుమని తల్లి నర్థింపుము, ఆకాంక్షింపుము. నీ చైతన్యము మేలుకాంచి యనన్య భక్తిశ్రద్ధలతో దీవ్రముగా నాకాంక్షించిన నీ మనస్సు జ్ఞానమందభి వృద్ధి నొందగలదు. అయితే శాంతి స్థిరతల పాఠము మొదట నభ్యసింపవలెను.

* * *

చురుకైన సుతి మెత్తని భౌతిక ప్రాణముచే కలత గలుగు చున్నది. అందులో విశేషముగా నది ప్రాణసమేతమైన భౌతికము. భౌతికము రానురాను చురుకగుట మంచిదే. కాని యది సాధారణ మానవచేష్ట ప్రతిచేష్టలకు లొంగగూడదు. వాని స్పర్శచే క్రుంగి తబ్బిబ్బు బడ గూడదు. మనస్సు నందేగాక రక్తనాళమునందును, శరీరము నందును గూడ సంపూర్ణ బల సమత్వములును ఉదాసీనతలును గలుగవలెను. అప్పుడు భౌతికము కలతజెందక నేర్పుతో ప్రాపంచిక శక్తుల ననుసంధానము చేయగలదు. వాతావరణము నుండి వచ్చు శక్తుల యొత్తిడిచే గలతజెందక యా శక్తుల తత్వ మెఱింగి వానిని దూరముగా బారదోలవలెను.

* * *

తాను దన తప్పుల జెడునడతల నెఱింగి వానికి బెడముఖమై యుండుట చక్కని రాచబాట.

ప్రశాంత మనః ప్రాణంబులు నీకు చేకూరునంతవరకు బరుల విమర్శింప వలదు, వారి తప్పొప్పుల నెన్నవద్దు. నిన్ను నీవే పరీక్షించుకొనుచుండుము. ఇదియే శ్రేష్ఠతరమైన సిద్ధాంతము. ఇది గాక పైకి నేదో క్వచిత్తుగా గమపించు వేషభాషల జూచి ఒడు దుడుకు అభిప్రాయములకు నీ మనస్సును రానియ్యకుము. అట్టి యభిప్రాయముల కనుసరణీయముగా నీ ప్రాణశక్తిని గ్రియోన్ముఖము గానియ్యకుము.

సర్వకాల సర్వావస్థలయందు బ్రశాంతముగా నివసించుటకు నీ యంతస్సత్తయం దొక స్థానముగలదు. అచ్చటనుండి నీ బాహ్య చైతన్యపు తారుమారులను నిష్పక్షపాతముగా విమర్శించుటకును వానిని జక్కపఱచుటకును నీవు శక్తి సామర్థ్యములు గలిగి యుందువు. ఆ యంతస్సత్తయొక్క ప్రశాంతిలో నివసించు రహస్యమును దెలిసికొనిన ముల్లియ దొరికినవానికి జలింపని కుదురుబాటు గలిగిన చందమగును.

* * *

ఈ బాహ్య విషయములచే బాధపొందుటకుగాని యలజడి పొందుటకు గాని సమ్మతింపగూడదు. అన్నివేళలయందు జేయవలసిన దేమన భగవదాకాంక్షయందు జలింపని భక్తి గలిగి కష్టములను శత్రుసముదాయమును సమత్వముతోను నుదాసీనతతోను నెదుర్కొనుటయే. ఎందుకనగా నెవ్వరాధ్యాత్మిక జీవితము వాంఛింతురో

యట్టివారికందరికి దైవము వినా మరేదియు నగ్రస్థాన మలంకరింప జాలదు. దైవమునకు ప్రథమ తాంబూలము. దైవేతరములైన వానికి రెండవది. తామరాకుపై జలబిందువు చందంబున నంటీ యంటగనటుల మెలంగుచు నంతరంమున భగవానునికి దన్ను దానర్పిం చుకొన్న భక్తునిచందంమున శాంతి పూరితమైన యంతర్ముఖవిలోక నము గలిగి యీ బాహ్య విషయములవైపు బారజూడుము.

* * *

ప్రస్తుతము నీ యనుభవములు. మనఃకక్షయంచే యున్నవి. మఱియు నదే చక్కని మార్గము. అనేక సాధకు లభివృద్ధి బొంద జాలకున్నారు. ఎందుకన మానస చైత్య కక్ష్యలు పరిపక్వములు గాకమునుపే ప్రాణకక్ష్యల మేల్కొలుపుదురు. ఆధ్యాత్మికానుభవములు మనఃకక్ష్యయందు గొంత ప్రారంభముగాగానే కసురుగాయను బిపికి పండు చేయులాగున లగ్నఘటిక రాకమునుపే ప్రాణకక్ష్య లోనికి దుమికి గందరగోళములోదిగి చీకాకుపడుదురు. ఆధ్యాత్మిక మాధు ర్యమును మనస్సు చవిజూడకమునుపే రాజసిక విషయానుభవముల కళ్ళులు చాచిన నింతకంటె ప్రమాదకర మగును. ఇట్టి ప్రమాదము లకు లోనుగాకుండ హెచ్చరిక కలిగియుండుము.

ఎల్లప్పుడు చైత్యమనస్సత్తలను సత్యజ్ఞానానుభవముల సంగ్ర హణములకు సంసిద్ధి యొనర్ప నుత్కాంక్షగల్గియుండుము.

అచంచలత, శాంతి, స్థిరమైన శ్రద్ధ, ప్రౌఢ్దుదిరుగుడు పుష్పము తీరుగాక యేకముఖముతో నడుగడుగునకు ప్రవర్ధమానమగు విస్తరణ, ఇంతింతలగు జ్ఞానము, అగాధ, తీవ్రోద్వేగ రహితమైన భక్తియను నీ షడంగముల యుపలబ్ధి కొఱకు నతిశయాతిశయముగా నాకాంక్షింపుము.

నిన్ను పరివేష్టించియుండు వానితోను వాని విరోధముతోను సంకటపడవలదు. ప్రప్రథమమున నిట్టి పరిస్థితి యొక విధమైన పరీక్షకొఱకు విధించబడియున్నది. ఈ సందర్భములందు నీ యంతరంగమును దహతహ పడనీయక, తబ్బిబ్బు గానీయక, నీవు సావధానచిత్తుడవై సాధన నిలుపక సాధించ్చితివేని యట్టి సాధన నీకు గావలసినంత బలమును జేకూర్చగలదు. యోగమార్గము లేత పచ్చికబయళ్ళపై విహారమువంటిదికాదు. అడుగడుగునకు బాహ్యాంతర పరిస్థితులతో నాటాట చెక్కబడియున్నది. వాని నెదుర్కొను వెనుకంజ వేయని యచంచల బలము సన్నగిలకుండ నభివృద్ధి జేసికొనుట యత్యవసరము.

* * *

ఆధ్యాత్మికాభివృద్ధి యంత యెక్కువగా బాహ్య పరిస్థితులపై నాధారపడి యుండదు. మన యాంతర్యమునుండి యా బాహ్య పరిస్థితుల ప్రతిఘటించు నేర్పుపైననే ముఖ్యముగా నది మొనకొని యున్నది. ఇదియే కడపటి యాధ్యాత్మికానుభవ సిద్ధాంతము. అందు

కొఱకే సరియైన దృష్టి నవలంబించుట, యా దృక్పథము నందే మొండిపట్టుదల గలిగియుండుట, బాహ్యపరిస్థితులపై నాధారపడని యాంతరంగిక యచంచల ప్రశాంతస్థితిని గలిగియుండుట. అట్టి శాంతి యుత్తర క్షణమే గలుగని యెడల జీవితములోన యూడ్పులకు గాడ్పులకు బాహ్యాక్రాంతమైనట్టి యుపరి మనస్సులో సంచారము చేయుటకు మారుగా మఱిమఱి యంతర్ముఖ సంచారము గల్గి జీవితచర్యల వీక్షించుట యాదిగాగల విషయములు ప్రధానములని మేము మఱిమఱి నొక్కి చెప్పుచున్నాము. ఇట్టి యాంతరంగికపు స్థాయిపొందిన వాడు జీవితమును జీవితములో తారుమారుచేయు శక్తులను జయించుటకు ద్విగుణీకృత బలసమృద్ధు డగును.

అంతరంగమున బ్రశాంతిగా నుండుటయు, ఏ యొక్కటి సంభవించినను బ్రారంభించిన సాధన యందు వెనుదీయక గట్టి పట్టుదలగల్గి యుండుటయు, విపత్తులయందును గ్రిందుమీదులందును దబ్బిబ్బుపడి ధైర్యము గోల్పోకుండుటయు నీ మూడును సాధనలో నేర్చుకొని తీరవలసిన ప్రథమ పాఠములు. ఇతరేతర ప్రవర్తన యస్థిరత్వమునకు దారితీసి బ్రోత్సహించును. మఱియు జేకూరిన యనుభవము చెదరిపోవుటకు గారణమగును. నీ వంతరంగము నందు స్థిరమతివై యుండినగాని యనుభవముయొక్క పోకడలు వంకర టింకర గాక స్థిరత్వము పొందజాలవు. అయితే సాధనలో నంతరాయములు, హెచ్చుతగ్గులగు పరిస్థితు లప్పుడప్పుడు సంభవిం

చక యెన్నటికిని పొజాలవు. అంతమాత్రమున సాధన తొలిగిపో యినదని యనరాదు. ఈ యంతరాయములు జక్కని దృష్టితో స్వీకరింపబడిన నవి జీర్ణతరుణములు గాను గష్టపరిసమాప్తికాలములం గాను బరిణమించును.

ఆధ్యాత్మిక వాతావరణావశ్యకత యితర బాహ్య నియమముల కంటె నధికతరమైనది. ఎవ్వ డట్టి వాతావరణమును పొందగల్గునో, మఱియు నెవ్వడు తన కనుగుణమగు నాధ్యాత్మిక గంధమును సృష్టించుకొని దానినే యాఘ్రాణించుచు దానిలోనే నివసించునో అట్టి వాడు దినదిన ప్రవర్ధమానుడగుట నిస్సందేహము.

దైవశక్తిని బొందుటకు లౌకికవ్యాపారములలో ఆ శక్తి నొక యంత్రముగా నుపయోగించుకొనుటకు మూ డత్యవసరము లైన నియమములు గలవు.

౧. అచంచలత—సమత్వములు :—ఏది సంభవించినను తబ్బి బ్బుపడక యచలస్థిరత్వముల విడనాడక మనోనిగ్రహము గల్గి శక్తుల క్రీడల దిలకించుచు దానుమాత్రము కూటస్థుడుగా నుండుట.

౨. అఖండ విశ్వాసము :—ఏది యుత్తమోత్తమమో యదియే సంభవించు నను నమ్మకము. ఎవ్వడు తన్ను తాను భగవంతుని

నిజమైన కొలమట్టుగా జేసికొనునో అట్టివాడు భగవదిచ్ఛను బరిగ్రహించి యట్టి యిచ్ఛానుగుణముగా గర్మ నాచరించును. అట్టి కర్మయే కర్తవ్యకర్మ.

౩. సంగ్రహణశక్తి:—భగవచ్ఛక్తిని స్వీకరించి యట్టి శక్తి భగవచ్ఛక్తి యనియు మాతృప్రసాద మనియు గృతజ్ఞతాభావముగల్గి మనోవాక్కాయకర్మల నా శక్తిచే నడిపింపబడుట కిచ్ఛగించుటే సంగ్రహణశక్తి. ఈ శక్తి సాన్నిధ్యముల స్పర్శింపగల మార్దవము నీ కలవడిన, గార్యరంగములో నీ చైతన్యమున కట్టి యొదుగుడలవాటైన దుది ఫలము తప్పక సిద్ధించును. ఇతర విషయములకు జోటియ్యక భగవచ్ఛక్తికి మాత్రమే యనుగుణముగ నుండుము.

* * *

సమత యీ యోగమునకు ముఖ్యప్రాణాంగము. ఎట్టి యావేదనలను బాధలను సరకుజేయక సమత్వమును గాపాడుకొనవలెను. అనగా నారాటపడక, సంకటపడక, కృంగక, నిరాశజెందక యీశ్వరేచ్ఛయందు దృఢమగు నమ్మకము గలిగి ప్రశాంతమైన దృఢమగు నమ్మకము గలిగి ప్రశాంతమైన దృఢమనస్సుతో ఘటనాఘటనముల సహించి యుండుట. అయితే తమఃప్రధానమైన సహింపుసమత్వముగా నెన్నబడదు. సాదృశ్యప్రాయముగా సాధనలో నేదో కొంత ప్రయత్నమునకు తాత్కాలికముగా భంగముగల్గిన సంకటపడక, నిరుత్సాహపడక సమత్వమును భద్రముగా బోషించవలెను. కాని యపజయము భగవదిచ్ఛయొక్క సూచన

యని యామోదించి ప్రయత్నమును విడువరాదు. అందుకు బదులుగా నీ యోటమికి నర్థమేమి? కారణమేమని యన్వేషించి భక్తి శ్రద్ధలు గలిగి జయోన్ముఖుడవై ముందుకు సాగుము. అలాగే జబ్బులపట్లగూడ జబ్బు సంభవించి నప్పుడు సంకటము, అలజడి, ఆరాటము జెందక, అనారోగ్య మీశ్వరసంకల్పమని యామోదింపక యది శరీరలోపమని గ్రహించి మనః ప్రాణలోపము లేవిధముగా వదలించుకొనుటకు బ్రయత్నింతువో తద్విధముగనే జబ్బునుగూడ వదలించుకొనుము.

*
* *

సమతలేనిదే సాధనలో నిక్కచ్చి పునాది గలుగజాలదు. పరిస్థితు లెంత యసంతృప్తికరముగ నున్నను, నితరుల నడవడిక ఎంత యప్రియముగ నున్నను నీవు మచ్చలేని ప్రశాంతితో దబ్బిబ్బుచేయు ప్రతిచేష్టలకు లోనుగాక వానిని స్వీకరించుటకు నీవు నేర్పరివి గావలెను. ఇట్టి నేర్పుగల ప్రవర్తనయే సమతయొక్క గీటురాయి. అన్ని విషయములు నీ కోరిక పంటలైనప్పుడు, ప్రజలు పరిస్థితులు ననుకూలముగా బ్రవర్తించినపుడు, ప్రశాంత సమత్వములు గలిగియుండుట విశేషముగాదు. పరిస్థితులు ప్రతికూలములైనప్పుడు ప్రశాంతసమత్వముల పూర్ణత్వముల బరీక్షింపబడుటకును, ద్విగుణీకృతము చేయబడుటకును, లోభరహితమొనర్పబడుటకును మనకు వీలగును.

ఎట్టి నియమములను బాటించిన బరమేశ్వరశక్తి నీ యహంకారస్థాన మలంకరించి నీ మనోవాక్కాయములను దన యుపకరణములుగా జేకొని కార్యము నడిపించునో యట్టి నియమములు నీకు సంభవించిన యనుభవము చాటుచున్నది. సంగ్రహణశక్తి గల మనోమౌనము, కర్తృత్వమనోహంకార నిర్మూలనము, సాక్షిభూతుడ నను భావార్జనము, పరాత్పరశక్తితో సన్నిహిత సంబంధము, ఇతరశక్తులకువినా మాతృశక్తికే సత్తను వికసితముచేయుట యీ యైదుమార్గముల నభ్యసించిన నీవు భగవంతుని పనిముట్టువై "నీవే తప్ప నితఃపరంబెఱుగ" నన్నట్లు ప్రవర్తించగలవు.

మనస్సుయొక్క నిశ్చలనీరవత తనంతకుదాను విజ్ఞానమయ చైతన్యమును నవరోహింప జేయజాలదు. సాధారణ మనస్సునకు, విజ్ఞానమయ మనస్సునకు జైతన్యభూమికలనేకములు గలవు. నిశ్చలనీరవతయగు మనస్సు మిగిలిన సత్తను విశేషవిషయముల కున్మీలనము జేయును. "ఒకప్పుడు విశ్వచైతన్యమునకు, నొకప్పుడు నిర్గుణబ్రహ్మానుభవమునకు, మరొకప్పుడు భగవంతుని సన్నిధానమునకు, లేక భగవద్విభూతులకు, ఇంకొకప్పుడు మానవమనస్సున కతీతమగు విశేషచైతన్యమునకు, —— వీనిలో నేదైన సంభవించుటకు మనస్సుయొక్క నిశ్చల నీరవతయే మిక్కిలి వాటమైన పరిస్థితి. ఈ యోగములో నన్నిటికంటె నతిశయాతిశయమైన యనుకూలపరిస్థితి యిదియే. ప్రథమములో భగవచ్ఛక్తి నిన్ననుగ్రహించుటకు, బిమ్మట నీ చైత

న్యములోని కవరోహించుటకు, నీ చైతన్యమును దీర్చి దిద్దుబాటొ నర్చుటకు, దానికవసరమైన యనుభవముల నొసంగుటకు, దాని దృష్టిని, లోకడలను నన్నిటిని మార్చిద్రిప్పుటకు, గట్టకడపటి మార్పునకు, దానిని (విజ్ఞానమయ) సంసిద్ధమొనర్చుటకు, నొక యంతస్తునుండి మఱియొకయంతస్తునకు, మార్జాలకిశోర న్యాయమున దానిని దీసికొని పోవుటకు, నీకు సర్వఫలములు సంప్రాప్తమగుటకు, నిశ్చలనీరవతయే కారణభూతమని యీ యోగము పరిగణించుచున్నది.



దేహమంతయు నాపాద మస్తకము ఇనుప ముద్దవలె చలన రహితమైన యనుభవ మేమి తెలయజేయుచున్నదనిన, స్థూలశరీరములోని కెన్నదగిన శాంతిబలముల యవరోహణమునే. (అయితే చాలామట్టుకు భౌతిక ప్రాణములోనికి). ఇట్టియచల ప్రాణశరీరములే యెల్లప్పటికి బునాదిగానుండి భద్రమగు ప్రాపైన స్థానముగా నేర్పడి వానిలోనికి భావికాలమున తేజ—ఆనంద—భక్తి—జ్ఞానము లవతరించుటకుగాని లేక లీల జరుపుటకుగాని యాధారములై యుండును. ఇతరయనుభవములో యోగశక్తి యంతర్ముఖసంచారమును గల్గియున్నందున శరీరము మొద్దుబారి నట్లుండును. ఈ యనుభవములో యోగశక్తి తన యోగానుభవముల బూర్ణజాగ్రదవస్థగల బాహ్యస్వభావములో బ్రతిష్ఠించుటకు బహిర్ముఖమై వచ్చుచున్నది. కనుక బాహ్యాం

క్రియములనుండి చైతన్యము తిరుగుముఖమై పోవునప్పుడు కలుగు తిమ్మిరిసూచన లీ యనుభవములో లేవు.

*
* *

తహతహపడు నారాటమునుండి విముక్తిపడసిన మనః ప్రాణములు చేకూర్చిన యాంతరంగిక ప్రశాంతము భద్రమైన సాధన యొక్క ప్రధానాంగమని మొదలు జ్ఞప్తియందుంచుకొనుము. నీ లౌకిక వ్యాపారములందు తల్లి సాన్నిధ్యమును వీక్షించుచుండుట ఉపలబ్ధిలో నిప్పటికే విశేషస్థితిగానున్నట్టి స్థితి చాలామట్టుకు నాంతర్యాభివృద్ధిలేనిదే లభ్యపడదని తరువాత జ్ఞప్తియందుంచుకొనుము. పెన్నిధి నపహరింపబడిన వాని చందమున గొప్ప కొఱత గల్గినట్లు నీవు తహతహపడుచున్నావు. ఆ కొఱత యిట్టిదని నిర్దేశింపజాల కున్నావు. మాతృశక్తి పరమందుండి యవరోహించి నీ సత్తయొక్క వివిధ కక్ష్యల స్వాధీనపరచుకొని నీలో సాధన జరుపుచున్నదను సతత స్పష్ట యుక్తానుభవముకొఱకు నలమట పడుచున్నావు. అదియే నీకు గలిగిన కొఱత. పరాశక్తి యారోహణావరోహణలను జంటయైన క్రియాతాండవమునకు నీకు గల్గిన కొఱత యంకురార్పణ వంటిది. ఆ శక్తి తాండవము తప్పనిసరిగా సరియైన ముహూర్తమునకు నీకు సంభవించి తీరును. ఇందులో మఱియొక విశేషమేమన మనస్సు పరిభ్రమణకు వాడుకపడి మౌన సాధనకు దూరమైనందున నీ శక్తి తాండవము నీకు దీర్ఘకాలమునకు గాని సంభవింపదు. ఆ మనోవిస్మరణశక్తి పనిచేయుచున్నప్పుడు పాదరసము

పరుగాడు చందంబున బరుగిడు మనస్సును తెలమలుగున నా విశేష కార్యము జరుగవలసియున్నది. ఇట్టి తెలచాటున విరివైన సన్నా హము వాస్తవముగా సమకూర్పబడుచుండగా సాధకు దేదియు జరు గలేదని యాలోచన బడుచుండును. ఈ విషయములు తేటతెల్ల ముగా గన్పడుటకు బహుకాలము పట్టును. ఇంత కెక్కువ తట తట విస్పష్టమైన ప్రవర్ధమానము గావలయుననిన సతతము నీవు నీ యింద్రియానీకమును జిత్తమును నీశ్వరాయత్త మొనర్చు ఆత్మ సమర్పణ ద్వారా చైత్యపురుషుని ముందలకుదేవలెను. ఉబ్బూత లూగక తీవ్రముగా నాకాంక్షించుము.

* * *

సాధనలో మిక్కిలి దార్ఢ్యములైన మనః ప్రాణశరీరశక్తు లత్య వసరములు. ప్రాధాన్యముగా నీ స్వభావములోని మాంద్య విమో చనమొనర్చి యా స్వభావపు దట్టములోనికి శక్తి బలముల దెచ్చుటకు దగు కృషి సలుపుము.

యోగమార్గము సజీవముగా నుండవలెను. ఆ మార్గము మనస్సిద్ధాంతము గాగూడదు. లేక యన్ని యావశ్యకపు మార్పు లను సరకుచేయని యొక నిర్దిష్టపు త్రోవయందే ప్రాకులాటగాదు. అన్నిరోగములకు నొకే చికిత్సగాదు.

* * *

ఉక్కిరి బిక్కిరయి చూడక ప్రశాంతముగలిగి దృఢనమ్మకముతో జూచుచుండుట సరియైన దృష్టి. అయితే మాతాశ్రయమును ఏ కారణముచేగాని యుపేక్షింపక యామె చెప్పు చేతలలోనే మెలంగుచు నామె సహాయ్యమర్థించుట యత్యవసరము. తన లోపములను బలహీనములను మితిమీరి మననముచేయుచు వాని మూలమున మనస్సును బాధపరచి 'తా నబలుడను, ఎదుర్కొనుటకు శక్తివిహీనుడను' అను భావములం దీదులాడగూడదు. ఎందుకన నీ యభిప్రాయములు, భావములు నిన్ను బలహీనునిగా జేయు విషయములుగా బరిణమించుచున్నవి. కష్టములు, తొట్రుపాట్లు, అపజయములు నున్నయెడల వానివంక బ్రశాంతముగా నుపలక్షించుచు వాని నివారణోపాయమునకు నిబ్బరముతో విసుగుజెందక మాటిమాటికి ప్రార్థించి సహాయ్య మర్థింపుము. కాని ధైర్య విలోలత్వమునకు, బాధకు, గందరగోళమునకు సందియ్యకుము. యోగము అంత సులభమగు త్రోవగాదు. ఒక్కదినములో నీ స్వభావమును సంపూర్ణముగా మార్చుటకు శక్యముగాదు.

*
* *

నీ ముందు ప్రయత్నములో ఫలసిద్ధికొఱకు మిక్కిలి యాతురతతో నుఱ్ఱూతలూగి సల్పిన నిర్భరశ్రమోత్పన్నమైన కృషి లోటుచే నీకు నీజుగుప్సా ప్రాణ సంకటములు గలిగియుండును. కృషిలో కేంద్రీకరింపబడిన నీ చేతనము దిగుమొగము దాల్చినపుడు ఫలసిద్ధి కొఱకు తహ తహ పడిన నీ ప్రాణము నిరాశచే గలతలు దిగ్భ్రమలు

జెంది ప్రకోపించినది. అందువలన నపర స్వభావలక్షణములగు నల సత్వము, దిగులు, సంశయములు నిన్ను వశపఱ్చుకొనినవి. కనుక మనస్సునందేగాక ప్రాణ భౌతికములందుగూడ సమత్వ స్థిరతలను నెలకొల్పుటకు ప్రయత్నింపుము. శక్త్యానందముల జడి వానగుఱియు గాక; అయితే యట్టి శక్త్యానందముల భరించగల తొణకని యాధా రము లుండవలెను. సంపూర్ణ సమత్వమొక్కటియే యట్టి శక్తి సా మర్థ్యములను నీ యాధారమునకు బ్రసాదింపగలదు.

*
* *

స్థిరత విస్తరతలు యోగి చైతన్యముయొక్క పునాదులుగా నున్నవి. ఆంతరికాభివృద్ధి యనుభవమున కా స్థిరత విస్తరతలు సుప్ర సిద్ధమైన యనుపానముల వంటివి. భౌతికచైతన్యమును, శరీరమును శరీర ప్రత్యణువును విశాలస్థిరత్వముతో నింపి నిబిడీకృతము చేయబడిన అట్టి విశాలస్థిరతలు భౌతికచేతనముయొక్క శుద్ధిసంస్కారమునకు నాధారములుగా నున్నవి. సత్యములో నీ వ్యాప్తిస్థిరత్వములు లేనిదే యీ ప్రబల శుద్ధిసంస్కారము శక్యతరము గాదు.

*
* *

చేతన శరీరమునుండి యుద్గమించి యూర్ధ్వమున దన పీఠమేర్ప రచుకొనుటయే యీ సాధనయొక్క లక్ష్యము.— చేతన శరీరము నకే కట్టుబడక యంతటను విశాలముగా వ్యాపించుట.— ఇట్లు ముక్తి బొందిన వ్యక్తి సాధారణ మనస్సున కతీతమైయున్న దానినెల్ల బట్టబయ లుగా వీక్షించ గలడు. ఊర్ధ్వశిఖరములనుండి యవరోహించు దాని

నందిపుచ్చుకొనుచు నధోముఖమున నున్నదానినెల్ల నుపలక్షించుచుండును. అందువలన దన కధోభాగమున నున్న దానినెల్ల దిలకించుకొనుటకును దన యదుపాజ్ఞలలోనికి దెచ్చుకొనుటకును బూర్ణస్వాతంత్ర్యము గల్గి యుండును. మఱియు నూర్ధ్వమునుండి తన శరీరములోనికి బ్రచండ ముగా దుమికివచ్చు దానినెల్ల స్వీకరించుటకు గూడ సంపూర్ణ స్వాతం త్ర్యము గలిగియుండును. ఇట్టి యనుభవములు శరీరమును విశేష చేతనములోనికి, స్వభావములోనికి దిరుగా బోతపోసి యా శరీరము నున్నత పరిణామమునకు నుపకరణముగా నాయత్త పఱచును.

నీలో నిప్పుడు సంభవించుచున్నది యేమన నీ చైతన్య మూర్ధ్వ మున దన స్థాన మేర్పరచుకొనుటకు బ్రయత్నించుట. ఏ వ్యక్తి యిట్టి యూర్ధ్వసౌధములో సంచారము చేయగలుగునో యట్టివ్యక్తి యాత్మ స్వతంత్రతను, నపార నిరంతర నిశ్చల నీరవతను, ధృవమగు స్థిరతను గనుగొనును. ఐతే యీ స్థిరతను శరీరములోనికి, దాని వివిధ కక్ష్యల లోనికి నూర్ధ్వమునుండి తీసికొనిరావలెను. ఆ స్థిరత యెన్ని వ్యాపా రములు గలిగియున్నను సాక్షివోలె నిర్లిప్తమై వెనుక ననిర్దేశ్యమైన దానివలె పొదుకొని యుండును.



నీ చైతన్యము శిరస్సుపైకి బ్రకోపించిన నది సామాన్య మనస్సు నకు నతీతమైన స్థానము చేరగలుగును. ఆ స్థానమునుండి విశేషచేత

సత్యమునుండియే యుద్భవించవలెను. అహంకారేచ్ఛా ద్వేషములు లేక, వ్యక్తిగతేష్టా నిష్టములు గాక, భగవదిచ్ఛయే యా ప్రవర్తనకు గారణ భూతముగా నుండవలెను.

* * *

మనసిద్ధాంతములు విశేష ప్రాముఖ్యము గలవిగావు. ఎందుకన సత్తయొక్క యభిరుచి కనుసరణీయముగా మనస్సట్టి వాదముల గల్పించు చుండును; లేక యామోదించుచుండును. ముఖ్యముగా గమనింపవలసినది నీ యభిరుచి; మరియు నీలోని యంతర్వాణి.

ఆఖండ స్వరూపములగు సచ్చిదానందములు శూన్యరిక్త నిర్వాణములు మాత్రమే గావనియు, లేక రూపనామములు లేని యచలాద్వితీయములు మాత్రమే గావనియు శక్తి సమేతమైన యఖండ స్వరూపమనియు గూడ భావింపుము. ఇట్టి దివ్యచైతన్యమును బరమందే గాక యిహమందు, నీ జీవితమందు నుపలబ్ధిని బొందగలనను జ్ఞానోదయమును దదనుసరణీయమగు భాగవత జీవితమును యోగ గమ్యస్థానములని యామోదించుట మనస్సుకు సంబంధించిన విషయముగాదు.

ఇది మనోవ్యూహ సమస్యగాదు, తర్కవాద పరీక్షకు నిలువలేదని నా యభిప్రాయముగాదు. ఇతర వాదముల నెంత నేర్పుతో

దర్కము సమర్థింపగలదో యంతకు మిన్నగాకున్నను దీసిపోక యీ యాధ్యాత్మిక సమస్యను గూడ సమర్థించగలదు. ఐన నది మాటల నెఱుకల మనముల కందరానిది. అనుభవ వేద్యమైనది. అనుభవము లబ్ధమగుటకు మున్ను ప్రాణ మనస్సుల లగ్నముచేయగల యాత్మశ్రద్ధా భక్తు లావశ్యకములు. దివ్యజ్యోతి సంయోగానుభవములు సంప్రాప్త మైన వా డధోగతి పాలైన నింద్రియము లీ యాధ్యాత్మిక మార్గము ననుసరించుట కెంత నిరోధించుచున్నను నీ మార్గమునే యనుగ మించును. అట్టి దివ్యజ్యోతిచే స్పృశింపబడిన వాని కుపలబ్ధి గలుగక పోయినను భగవదనుగ్రహ రూపమగు శ్రద్ధాభక్తులు నాత్మాను సంధాన నిర్బంధమును గలిగియున్నయెడల దాని వెనువెంట రాగలడు.



భగవంతునియొక్క చర్యలు మానవుని మనస్సుయొక్క తీరున నుండవు; అవి మన జాడల ననుసరించి యుండవు. అవి భిన్నములు. వాని విమర్శన బుద్ధి కతీతమైనది. అవాఙ్మానస గోచరము. ఆతని కర్తవ్యాకర్తవ్యములును మనచే నియమింపబడుట యసంభవము. ఎందుకన మన జ్ఞానముకంటే భగవంతుని జ్ఞాన మపారము. మనము నాస్తికులముగాక యాస్తికులమైన, ముందువెనుకలు జూడని యచంచల భక్తి శరణాగతులు మన కత్యవసరములు. నిజమైన భక్తి

జ్ఞానము లీ భావమునే భేదాభిప్రాయము లేక యేక ముఖమున ఘోషించు చున్నట్లు నాకు గోచర మగుచున్నది.



తన యభిప్రాయములను గోరికలను భగవంతు డీడేర్చలేదని వాపోక భగవదిచ్ఛను బరిగ్రహించి దాని ననుసరించుట సాధకుని సరియైన దృష్టి. "ఇది నా హక్కు, నా కోరిక, నా యవసరము, నా బాధ్యత, నా యక్కర, ఎందుకు నేను బొందగూడ" దని వా కొనరాదు. అయితే తన్నుదా నర్పించుకొనుట, శరణుజొచ్చుట, దుఃఖవిముఖత్వములు లేక భగవంతు డొసంగునది మహాప్రసాదమని స్వీకరించుట శ్రేష్ఠతరమైన మతము. ఇట్టి మత మలవడిన తదుపరి నీకు సంప్రాప్తమగు నదంతయు నీకు మే లొనగూర్చునదిగా గనుపట్టుచుండును. భగవంతుని యందు భక్తి విశ్వాసములు, భగవచ్ఛక్తికి నాత్మ సమర్పణ శరణాగతు లత్యవసరమే గాక యపరిత్యాజ్యములై యున్నవి. భగవచ్ఛరణ్యమును మిషగా జేకొని నీ సోమరితనమును, నలసత్వమును, బలుస్వభావ ప్రేరేపణలకు నీ బానిసత్వమును భగవంతుని తలమీద రుద్దవలదు. నిజమైన యాత్మసమర్పణ, తడబడని యాకాంక్షతో 'భగవత్సత్య వ్యతిరేకతల విచ్ఛిన్నము చేయగల పట్టుదలతో మిళితమై యుండవలెను. స్వార్థపరమగు కోరికలకు, నీచవృత్తులకు, నీ యహంకారమునకు, లేక దైవప్రచ్ఛన్న వేషముల దాల్చి భ్రమింపజేయు నంధకారమయమగు

నవిద్యాశక్తికి నీ భగవత్శరణ్యముల నొక నెపముగనో కారణముగనో లేక ముసుగుగనో త్రిప్పి బలినీయవలదు.



నీ వాకాంక్షమాత్ర మొనర్పుము. తల్లి కనిస్మీలుడవై యుండుము. ఆమె నీలో బనిచేయవలెనన్న నామె సంకల్పములకు విరోధములైన వానిని నీ చెంత జేరనీయరాదు. సర్వకర్మముల నామె యందే సన్యసించి యామె కొఱకే యాచరింపుము. నీవు నిమిత్త మాత్రుడవనియు నీ ద్వారా నామె సర్వకార్యముల నిర్వహించుచున్న దనియు భక్తి విశ్వాసములు గలిగి యుండుము. ఈ విధముగ నీ మనోహృదయములు వికసితములై నిరీక్షించుచున్న యెడల జ్ఞానసిద్ధులు సరియగు కాలమునకు సంప్రాప్తము లగును.



భగవత్ప్రేరేపణానుగ్రహముల కునిస్మీలన మొనర్చు శక్తిగల వాడీ యోగమందు దరించగలడు. ఇదియే యీ యోగమునకు మూల సూత్రము, ఎన్ని యిడుములకైన, ఆటంకములకైన సరకుచేయక త్రికరణశుద్ధియుక్తమగు నాకాంక్షతో బరాచేతనోపలబ్ధి కొఱకు శాంతి పూరిత దృఢనిశ్చయుడవైన నేదో యొక రూపమున దప్పక దైవాను

గ్రహము బడయగల్గుదువు. నీ మనోహృదయ శరీరముల బక్వాపక్వ స్థితుల ననుసరించి త్వరితముగనో తడవుగనో యా యనుగ్రహము గలుగవచ్చును. కనుక నెవ్వనికి నిలుపు నిదానము, సహనము లను నవి లేకుండునో యట్టివాడు ప్రారంభములోగల ప్రయాసచే దన యుద్య మము విడువవచ్చును. ఈ యోగములో నొక నిర్దిష్ట పద్ధతిలేదు. హృదయకేంద్రమునందు నేకాగ్రత వహించి దల్లికి మొఱలిడుము. ఇదియే ప్రశస్తమగు సులభసాధనము. భ్రూమధ్యమునందు గాని లేక శిరస్సునందుగాని తదేక ధ్యాననిష్ఠ జరుపవచ్చును. ఐతే యీ గ్రంథులు వికసితములగుట బహుకష్టము. మనస్సు చలన రహితమై యేకాగ్రత గాఢతరమై యుత్కాంక్ష తీవ్రతరమైన అనుభవ సూచనలు తలజూప మొదలిడును. భక్తిశ్రద్ధలు పెంపొందు కొలది పలోన్ముఖము శీఘ్రగమనము దాల్చును. అన్ని సాధనలతో నిమిత్తము లేక దైవముతోడి నిత్యయోగ సంఘటనమునకు దివ్యమాతృశక్తి మూర్తుల సంగ్రహణములకు జయప్రదముగా సాధన సాగింపుము.



నీ స్వభావములో నెట్టి లోపము లున్నను నిరుత్సాహుడవై దిగు లొంద నవసరము లేదు. అగత్యమైన విషయమొక్కటే గలదు. అట్టిది పరాశక్తి కుపక్రమిడవై యుండుటే. అది సంజీవి వంటిది; భగవత్సహాయ్యము లేక స్వయంకృషితో నిన్ను నీవు పవిత్రము చేసి కొన జాలవు. ఒక్క దివ్యశక్తి మాత్రమే బావన మొనర్చగలదు.

నీ వృశ్చికుడవై యున్న జాలును. మిగిలిన దంతయు నీ కొఱకు మాతయే యొనర్చును.

*
* *

నీ వెంత బలసమన్వితుడవైనను దివ్య సహకారము లేని నీ బుద్ధి కాంక్షాబలములతో నీ నికృష్ట స్వభావమును రూపుమాపజాలవు. స్వయంకృషి యొనర్చువారు గూడ వారివారి నీచ స్వభావము నేదో యొక విధమగు నదుపాజ్ఞలలోనికి దేగల్గుదురే గాని సంపూర్ణా విచ్ఛిన్నం బగు సారధ్యములోనికి దేజాలరు. దివ్య సహకారము నవతరింప జేయుటకు, నపరశక్తులతో బోరు సల్పుటకు, ఆ దివ్యశక్తి నీ యెడ నుండుటకు దృఢసంకల్పావేశములు నీ కత్యవసరములు. ఆత్మ తృష్ణ నీడేర్చగల పరాశక్తి. హృదయమందలి చైత్యపురుషుని యావే శము మాత్రమే నికృష్ట స్వభావముపై దండయాత్ర సలుప గలుగును.

*
* *

మానవ ప్రకృతికి లేక నీ వ్యక్తిగత స్వభావమునకు నీవు సంక ల్పించుకొన్న కార్యము వ్యతిరేకమై సంఘర్షించిన నట్టి కార్యమును నీ మనోనిగ్రహముచే నిగ్రహించుట బహు కష్టతరము. ఒక లక్ష్య మును సాధించుటకు గడంగిన మనోనిశ్చయము, పట్టుదల, సహనము గలిగియున్న సఫలము గాగలదు. ఐతే ఫలసిద్ధి దీర్ఘకాలమునకు గాని చేకూరదు. అది రాజమార్గముగాదు; నిశితారణ్య మార్గమును బోలి యుండును. పతనపరంపరలలో జిక్కి ముందు వెనుకలకు దడవు

లాడుచుందువు. ఇదిగాక ప్రారంభములో సఫలత యేదో కొలదిగా నుండును.

అప్రయత్నముగా సర్వకర్మలను భగవదర్పితముగా నాచరింప బడుటకు మనోబల నిగ్రహము మాత్రమే చాలదు. సమర్పణార్హుడైన వాని దివ్యసాన్నిధ్యభావోపలబ్ధుల జేకూర్పగల, తీవ్రాకాంక్షగల హృదయ దాంపత్యము నీకు గల్గినప్పుడే అట్టి సమర్పణ చేయగలవు. భక్తాగ్రేసరులు స్వప్రయత్నము మీదనే యాధారపడక వారుపాసించు దైవానుగ్రహ బలములపై నాశ్రయము గలిగి యుందురు. నీ వతిశయాతిశయముగా నీ మనోబుద్ధుల మీద నాధారపడియున్నావు. అందుచే నీ వభివృద్ధి నొందజాలకున్నావు. నీ యుద్యమమునందు నీవు మాత్ర సహకార మర్థించుటయేగాక కంటికిరెప్ప చందంబున నామే నిన్ను దినంబును రక్షించుచున్నదను భావనలో మునిగియున్నగాని నీ బంధము క్షీణించి తుట్టతుద కంతర్ధాన మొందజాలదు.

* * *

శ్రద్ధాభక్తి సమన్వితమగు ప్రతి యాకాంక్షయు సఫలీకృతమగును. నీవు త్రికరణశుద్ధియుక్తశ్రద్ధోపేతుడవైన భాగవత జీవితమందు ప్రవర్ధమానుడవగుదువు. అనన్యభక్తిశ్రద్ధ లనగా దివ్యసత్యమునే యాకాంక్షించుట, రానురాను నతిశయాతిశయముగా దివ్యమాతకు నిన్ను నీ వర్పించుకొనుట; ఈ యావేశము వినా యితరేతరవ్యక్తిగతాశాపాశముల విసర్జించుట; జీవయాత్రలో నీ ప్రతి సంఘటనము

దైవమునకే యర్పణజేయుట; అహంకార మమకారభావన లేక భగవ త్కైంకర్యముగా భగవంతు డొసంగు కార్యముల నిర్వహించుట. ఈ లక్షణములే భాగవత జీవితముయొక్క పునాదులు. ఉత్తరక్ష ణమే ఈ భాగవత జీవితముయొక్క సంపూర్ణావతరణమును నీవు పొందజాలవు. కాని సతతయుక్తా వేదనతో నిష్కల్మష హృదయ ముతో నిష్కాపట్యబుద్ధితో భగవదాశ్రయముకొఱకు బరితపించి మ్రొక్కు లిడిన నీ దివ్యచైతన్యములోనికి దానుదాను నెంతెంతో నభివృద్ధి బొందగలవు.



ఇంత కొద్ది కాలమునకే సంపూర్ణ శరణాగతి లభ్యపడదు. ఎందుకన బరిపూర్ణ నివేదనయన నహంకారమను యజ్ఞపశువుయొక్క ప్రతి యవయవమును ముక్కలుముక్కలుగా భగవచ్ఛరణ వేదికపైన ఖండించి భగవదర్పణజేయుట. మనఃప్రాణ భౌతిక చేతనములు, వీనిలోని ప్రతివృత్తియు, ప్రతి వాసనయు, నామూలాగ్రముగా, ననుక్ర మముగా వరుసదప్పక వేఱు వేఱుగా శరణు బొందవలెను. వాని స్వకీయా చరణల వర్జించి భగవానుని జాడల నంగీకరించవలెను. అయితే నీవాచరింపవలసిన దేమన ప్రారంభములో నాత్మ సమర్పణయను కేంద్ర దృఢ నిశ్చయము నూనుట. అట్టి దృఢసంకల్పమును సఫ లీకృత మొనర్చుటకు నీకు వీలైన విధముగా ప్రతిసమయమును బురస్కరించుకొని సంపూర్ణాత్మ నివేదనలోని కనుగమింపుము. ఒక్క దిశలో శరణ్యమునకు జొరవ గల్గిన నది తక్కిన దిశలందు

సులభముగా వ్యాపించగలదు. గత్యంతరములేక వ్యాప్తమొందును. ఆ శరణాగతి యొక్కటియే యితర బంధముల ద్రెంపజాలదు. మఱియు సడలింప జాలదు. అందులో ప్రముఖముగా నీ ప్రకృతపు మూర్తితత్వములో నల్లిబిల్లిగా నల్లుకున్న ప్రతి బంధకములు వాని శాఖోపశాఖలగు గారాబు నాశయములు అలంఘ నీయములగు నాటంకములు నడ్డు దగులుచుండును. ఇట్టి యాటంకములు కేంద్ర సంకల్పము కార్యనిర్వహణములోనికి నడుగిడిన తర్వాత గూడ సంభవించుచుండును.



నీ వొనరించిన తప్పిదము నేవిధమున దిద్దుబాటు చేయనగునని ప్రశ్నించియున్నావు. నీవు నుడివిడిన దంతయు నొప్పుకొన బడినను దానికి జక్కని పరిహారము భగవత్సత్య వాత్సల్యములను నీలో ప్రతి బింబింప జేయబడుటయే. అట్టి యుపలబ్ధికి సంపూర్ణాత్మ నివేదనము, భగవంతునికి సంపూర్ణాత్మోన్మీలనము; అట్టి యున్మీలనమునకు బ్రతి బంధకములగు వాని బహిష్కరణము ప్రథమ పూజలుగా నున్నవి. ఆధ్యాత్మిక జీవితములో నెట్టి యపరాధమునకుగా యీ పూజలకు మించిన ప్రాయశ్చిత్తము లేదు. సంపూర్ణముగా హరించు నది యేదియు లేదు. ప్రారంభములో నీ యాంతరికాభివృద్ధిని బరివర్తనము వినా ఇతర ఫలములగాని, సిద్ధినిగాని యర్థించరాదు. అటుగాకున్న ఘోర నిరాశాదుఃఖమునకు నీవు పాల్పడుదువు. నీవు స్వతంత్రుడవైనగాని యితరాదులకు బంధవిమోక్ష మొనర్పజాలవు. యోగములో నిన్న

వరోధించు నీలోని భీకరశత్రువుల గెల్చినగాని నీ బాహ్య ప్రతిపక్షులపై దండెత్తజాలవు.

* * *

ఉత్తరక్షణమే స్వయంకృషిని విసర్జింప సాధ్యముగాదు. అట్టి విసర్జన సర్వవేళలందు నపేక్షణీయమును గాదు. తామసికమైన యలసత్వముకంటె రాజసికమైన స్వప్రయత్నము శ్రేష్ఠమైనది. భగవచ్ఛక్తి నీలో వర్తించుచున్నట్లు నీ కుపలంబనము గలిగినయెడల నీ ప్రయత్నముల చేకొని నడిపింపుమనియు నట్టికార్యమును మాతృ కార్యములుగా బరిదాన మొనర్చు మనియు భగవచ్ఛక్తి నర్థించి నీలోనికి మఱిమఱి యాశక్తి నాహ్వానింపుము. అటులైన నీ కర్తృత్వమందు నొక మార్పు గలుగును. నీ యాధారములో బనిచేయు భూతములును మాత జేకొని నడిపించుటకు మొదలిడును. ఇట్టి మార్పాకస్మికమగు నైంద్రజాలికమైన మార్పు గాజాలదు. ఐతే దినదిన ప్రవర్ధనము గల్గియుండును.

ఇందుకు చైత్యసమత్వ మవసరము. త్రాసులో దూచబడిన చందంబున "నేను బొందు భగవచ్ఛక్తి యేది ? స్వయం కృషి యేది ? విశ్వగతా పరశక్తులతో మిశ్రమైవచ్చినదేది ?" యని నిర్ణయించగల విచక్షణాభివృద్ధి మీలో బెంపొందవలెను. భగవదధీనము లోనికి బూర్తిగా మారుటకు జాలకాలము పట్టును. అంతవఱకు నపర

శక్తుల నిరసనములు నిజశక్తులకు నిత్యామోదములు నిత్యవిధిగా నొనర్చుము.

ప్రకృత మావశక్యమైనది స్వప్రయత్న విసర్జనము గాదు. స్వప్రయత్నమును భగవ దధీన మొనర్పబడుటకు, నాతనిచే నడిపింపబడుటకు మఱిమఱి యీ యాకాంక్ష గలిగి యుండుము.



సాధన ప్రారంభదశలందు సర్వము భగవంతునకు వదలివేయుట గాని లేక సర్వ మాతడే సమకూర్చు ననెడు కొండంత యాశ గలిగి ముకుళిత హస్తములతో గొంతు గూర్చొనియుండుట గాని సమంజసము గాదు. చైత్య పురుషుడు నడుము బిగించి ముందు కరుదెంచి కార్య కలాపమును ప్రేరేపించునప్పుడు మాత్రమే స్వప్రయత్న విసర్జనము సాధ్యమగును. అప్పుడుగూడ నప్రమత్తత, మాటి మాటికి నొప్పుదల యావశ్యకము లగును. లేక పోనుపోను యోగాంత్య దశలందు విజ్ఞాన మయ మగు శక్తి ప్రత్యక్షముగా జేతనను జేకొని నప్పుడట్టి విసర్జనము సాధ్య మగును. ఇప్పటి కింకను ఆ స్థితి చాల దవ్వున నున్నది. ఇంత కితరత్ర సందర్భము లందీ స్వప్రయత్న విసర్జనము కదల మెదలలేని మొద్దుతనమునకు నలసత్వమున కీడ్చుకొనిపోవును.

సత్తలో స్వతంత్రత లేక యంత్రము పగిది యున్న యంశముల మాత్రమే చేతగాని దద్దమ్మలని నుడువనగును. అది స్వాభావికముగా

చురుకులేని మొద్దుస్వరూపము వంటిది. అది మనః ప్రాణంబులచే గాని లేక యున్నత శక్తులచే గాని లాగబడుచుండును. అయితే భగవంతుని చరణములకడ మన మనఃశక్తి సంకల్పముల సమర్పించుటకు మన కను కూల సావకాశములు గలవు. అట్టి సమర్పణభావ ముత్తరక్షణమే నీలో నెలకొనజాలదు, ఎందుకన నిట్టి యావశ్యకమైన శరణాగతి కిచ్చగించని నీచ పశు స్వభావము, లేక ప్రతిపక్ష శక్తులు, కొంతకాలము, బహుశః దీర్ఘకాలము, జయప్రదముగా నిన్నడ్డగించుచుండును. కనుక నీ కార్య రంగములో భగవచ్ఛక్తి యడుగిడువఱకు, నాటంకములు విచ్ఛిన్నములగు వఱకు, భగవంతుని పక్షమందే నీ మనోవాక్కాయముల నుంచుము. బహిష్కరించదగిన వానిని బహిష్కరించుచుండుము. దివ్యతేజశ్శక్తుల కున్ముఖుడవు గమ్ము.

నీ యజ్ఞానాంధకారములు నీ కెఱుక బడినట్లు నుడువుచున్నావు. అది మొత్తముమీద గనుబడిన సామాన్య స్వభావము. అట్టి జ్ఞానము చాలదు. కార్య రంగములో నా స్వభావముయొక్క చేష్టలు తూచాలు తప్పక నీ కవగాహన మైనప్పుడే పరివర్తన కార్యము నిజముగా ప్రారంభ మగును. నీ కెఱుక బడుచున్న నీ స్వభావ ప్రవర్తనలోని దుశ్చేష్టలను సళ్ళువిడువక పట్టుదలతో బైటికి గెంటుము. నీ మనఃప్రాణముల దివ్య శక్తి కార్యకలాపములకు నిరాటంకమైన పవిత్ర క్షేత్రముగా జేయుము.



అప్రయత్నముగా బుట్టగోగులవలె నుత్పన్నమగు ప్రవృత్తులను మనో నిగ్రహముచే నాపుదల చేయుట బహు కష్టతరము. ఏలయన నవి క్వచిత్తయినను వివేకముపైనగాని లేక యేవిధమైన సంకల్పావేగముల పైన గాని యాధారపడి యుండవు. ఐతే యవి భావకూటముపైననో లేక యప్రయత్నముగా దాపరించు స్ఫురణపైననో పాదుకొనియున్నవి. అట్లప్రయత్నముగా మూర్తీభవించు ప్రవృత్తులపైన బహిష్కరణ సాధన తుదకు నెగ్గగలదు. అయితే స్వయంకృషి పైననే యీ సాధన యాధారపడిన యెడల దీర్ఘకాలమునకు గాని నీకు జయము చేకూర నేరదు. భగవచ్ఛక్తి నీలో బ్రవర్తించుచున్నదను నుపలంబనము నీకు గలిగినప్పు డీ బహిష్కరణసాధన శీఘ్రఫల మొసంగ గలదు.

భగవంతుడే దిక్కని చేతులు జోడించుకొని బిక్కమొగము దాల్చ రాదు. అట్టిది జడత్వముతో గూడిన మాంద్యమగును గాని నిజమైన శరణాగతి కాజాలదు. తుచ్ఛపు కోరికలను సలహాలను నీ కామన విర పింప జాలనందుకు శరణాగతిని నెపముగా నెన్నవలదు.

యోగాభ్యాసమునకు రెండు పద్ధతు లెల్లప్పటికి నున్నవి. మొదటి త్రోవ జాగరూకత గల మనఃప్రాణములు వివేకము గలిగి తిలకించుచు, గమనించుచు, తర్కించుచు, గర్తవ్యా కర్తవ్యముల నిశ్చయించుచు, శమదమాదుల నార్జించుట. అట్టి సాధకుడుగూడ భగవచ్ఛక్తి మీదనే యాధారపడి యాశక్తినే తనలోనికి నాకర్షించుకొనుటయో లేక యాశ్ర

జాలకాలము పట్టును. కనుక నిట్టి ప్రశాంతము నీకు లభ్యపడు వరకు సాధనల నిలుపక సాగించుచుండుము.

*
* *

మాతృశక్తికి నీసత్త నుస్మీలన మొనర్చుట. నీ యహంకారము యొక్క యన్ని రూపాంతరములను, వాంఛితములను గోరికలను బహిష్కరించుట, యన్యాపేక్షల వర్జించి దివ్యసత్యమును మాత్రమే యాకాంక్షించుట, యీత్రయమును నీవు సాధింపగల్గిన యోగములో నీవు నిర్దేశించుకొన్న లక్ష్యమును బొందగల్గుదువు. ఇట్టి సాధనలు నీవు చక్కగా ననుష్ఠించిన యోగసిద్ధి కగత్యమైన పునాదులగు శాంతి సమత్వములను, ఆంతరిక బలములను, నిష్కల్మష భక్తిని, ప్రవర్ధమానమగు చేతనమును, నాత్మజ్ఞానమును భగవచ్ఛక్తి తేజమును నీకు ప్రసాదింప మొదలిడును.

*
* *

నీవు భగవదంశ సంభూతుడవను పరమసత్యము మ గ్రహించి తల్లి కున్మీలుడవై నీ సర్వకార్యములందును మాతృమూర్తిని దిలకించుచు నామె యానందము కొఱకు బాటు పడుము, ఇదియే నీ ధర్మము. నీ హృదయములో భగవంతుని సన్నిధానము

నీ కార్యరంగములో భగవంతుని యాధ్వర్యము గలదను భావము గలిగి యుండుము. చైత్యపురుషుడు పూర్తిగా మేల్కొన్నయెడల నీభావమును సులభముగాను శీఘ్రముగాను గాఢముగాను బొందగ లుగుదువు. చైత్యమునకొక్కసారి యాభావముగల్గినయెడల నట్టిది మనః ప్రాణతత్వములలోగూడ నావరింపగలదు.



నీ యితరానుభవములలో నున్న వాస్తవ మేమన దైవ వహాయ మర్థింపక స్వప్రయత్నములతో నెవ్వరుగాని నికృష్ట చేత నముమండి విముక్తి పడజాలదనుట. సత్యచైతన్యమునకు దూరస్థ మై తుచ్ఛ స్వభావములోనికి నీవు గ్రుంగినపుడు ప్రతిది యసంగత మనియు దుర్లభమనియు నీకు గాన్పించును. ఐతే యట్టి సూచనలు నిజములు గావు. ఏలయన భగవత్సంపర్కము నీకు గల్గినది. అందువలన నికృష్టచేతనమునకు బద్ధుడవై యుండవలసిన యవ సరము లేదు. సత్యమైన యుత్కృష్టచేతనము నిన్నావేశించినప్పు డట్టి యావేశము ప్రథమములో స్వల్పమైనను సర్వము చేయగలనను ధీర త్వము గలిగియుందువు. ఆ దివ్యశక్తి స్పర్శ ప్రారంభములో స్వల్పమైనను శ్రేయోదాయకమే. ఎందుకన సర్వము నాదివ్యశక్తియే నిర్వర్తింపగలదు. సంపూర్ణాత్మ పరిణామమునకు, శుద్ధిసంస్కారము నకు సావకాశము నాత్మకాంక్షయు నత్యవసరములు.



మాత ఇచ్ఛానుగుణ్యముగా ననువర్తించుటకు నియమములేవన తేజస్సత్యములను, బలమును బ్రసాదింపుమని యట్లు జాచుట. మఱియు నన్యశక్తుల బ్రేరేపణలకు వాని దాసత్వమునకు బాలుగా కుండునటుల నాకాంక్షించుము. ఇంకను గామోద్భవములైన వాంఛాశయముల నుపేక్షించి స్వకీయాలోచనల నభిప్రాయముల విసర్జించి దివ్యసత్యమును స్వీకరింపగల బ్రశాంత మనస్సుగలిగి యుండుము. తుదకు చైత్యపురుషుని మేల్కొలిపి యాతనికి నగ్రస్థాన మిడుము. చైత్యపురుషు డట్లు నీలో నాధ్వర్యము వహించిన మాతతో నీకు అవినాభావ సంబంధము గలిగి యామె నిజేచ్ఛను గనుగొనగలవు. ఎందుకన మనఃప్రాణము లితర బ్రేరేపణలను గూడ భగవత్ప్రేరేపణలని పొరబడగలవు. అయితే చైత్యపురుషుడొక్కతూరి మేల్కొన్న యెడల నట్టిపొరబాటు పడజాలవు.

విజ్ఞానమయ పరివర్తనము చేకూరిన యనంతరమే సంకల్పసిద్ధుడవు గాగలవు. అయితే త్రికరణములందు జ్ఞానయుక్తమైనవాడును, అప్రమత్తుడై హెచ్చరిక గలిగినవాడును నొకపరిపాటి దోషరహితమగు కార్యకలాపముల జరుపగలడు. ఇట్టి గుణాతిశయములు సంపూర్ణముక్తికి మార్గములేగాక యపరిత్యాజ్యములై యున్నవి.

*
* *

చర్విత చర్వణమునకు విసుగుజెంది క్రొంగ్రొత్తలు గోరువారు యోగాభ్యాసము చేయజాలరు. ఏదెట్లున్నను నీ యోగమునకు హను మంతుని వాలముపగిది తరుగని పట్టుదల సహనము లావశ్యకములు. మృత్యుభయము కామనయొక్క లోపము. అదిగూడ యోగార్థ తకు ప్రతిపక్షమే. తద్విధముగనే రాగద్వేషముల కెవ్వడు బానిసయై యుండునో యట్టివాడు యోగము ప్రయాసకరమైనదిగా గనుగొనును. బ్రహ్మసాక్షాత్కారానుభూతుల నొందుటకు దీవ్రముగా నాత్మ ప్రచోద నము. అంతరంగికాహ్వానము లేనివాడు పతనముజెందును. మఱియు వతని యుద్యమము బూడిద పాలగును.



కార్యసాధన విధానము మనము నిర్ణయించుకొన్న లక్ష్యము ననుసరించి యుండును. ఫలాపేక్షతో జేయబడు కార్యము తరుచుగా విసుగు విరామములేని కృషికే దారితీయును. కృషికి, కష్టమధిక ముగను ఫలము స్వల్పముగను నుండును. కార్యములో విఘ్నములు గలిగినప్పుడు లేక పతనము వాటిల్లినపుడు జుగుప్సజెంది యపనమ్మక ములపాలగును. అట్లుగాకపోయినను శక్తిని బలత్కారముగా గ్రిందికి పతరింపజేయును. ఇట్టి నిర్బంధ విధానము యోగములో బల సంపన్నులకు ననుభవజ్ఞులకు దప్ప తదితరులకు శ్రేయస్కరమైనది కాదు. అది ఫలప్రదాయియైనను భద్రమైనదిగాదు. ఎందుకన నుగ్ర

యించుటయో కలదని ప్రత్యేకముగా జెప్పనవసరము లేదు. నిజ మిట్లున్నను సాధకుని దృష్టిలో స్వయంకృషి ప్రధానస్థాన మలంకరించుచున్నందువలన బరువంతయు జాలమట్టుకు దన వీపుమీదనే యున్నట్లూహించుచుండును.

చైత్యపురుషుని మార్గము రెండవ విధము. నీ చైతన్యమును భగవానుని కుస్మీలన మొనర్చి, చైత్యపురుషుని మేల్కొలిపి నిర్గమింపజేయుము. మఱియు మనఃప్రాణ భౌతికములగూడ మేల్కొలిపి భగవానునికి వికసితము చేయుము. అట్టి యుస్మీలన సాధనలో గలుగు జ్ఞానమును బడయుచు, గర్తవ్య మేమని గమనింపుచు, భగవచ్ఛక్తియే దాని నెల్ల నిర్వహించుచున్నట్లు భావించుచు, దిలకించుచు నుండుము. మఱియు భగవంతుడు కర్తృత్వము వహించుటకు మొఱలిడుచు, నాతని చర్యల జాగరూకతతో నామోదించు చుండుము. భగవంతుడు నీలో నలుపు కార్యకలాపములకు నిట్టి ప్రవర్తన సాహాయ్యమిడును.

నీ చేతనము సంపూర్ణముగా భగవంతునికి వికసితమగు వరకు, భగవదిచ్ఛా జనితమైన ఋజుప్రవర్తన నీ కలవడువర కీ రెండు త్రోవలు మిశితమై యుండును. ఇట్టి యుపలబ్ధి పొందిన యనంతరము నీ వీపు మీది బరువు తొలిగి సర్వ బాధ్యత లంతర్ధానములగును.

* * *

తపస్సు గాని లేక శరణాగతిగాని వీనిలో నేదైనను సంశయింప నవసరము లేదు. నియమిత గమ్యస్థానమునకు వెన్నుజూపక, పట్టు దలతో, ముందుమొగమై యుండు టొక్కటే కర్తవ్యము. ఆ మార్గములో నొక్కతడ వడుగిడిన వా డెట్లు దానికి విముఖుడై వెనుకంజవేసి తక్కువైన నితరము చేరగలడు? మకరంద రసాస్వాదన మొనర్చు మధుపము మదనమునకు జేరగలదా ? నీకు బట్టుదలయున్న, పతనము లేమియు జేయజాలవు. తిరిగి నడుము బిగించి ముందుకు సాగుము. గమ్యస్థానము చేరవలయునని నీకు దృఢనిశ్చయమున్న భగవత్సన్నిధానమునకు గొనిపోవు మార్గమందు దుష్టతుదకు నపజయ మను నది నాస్తి. తోకవిఱుచు చందంబున నీలో ప్రబోధము జేయునది క్వచిత్తయిన నున్నయెడల నట్టి భగవదంశము నీలో నుమ్మాటికి నున్నందున వెనుకముందుల ద్రొక్కుట, క్రిందుమీదులువడుట, శ్రద్ధాభక్తులు సన్నంబులగుట పర్యవసానమునకు నేమాత్రము భేదము గలిగింపజాలవు. ఘోర రూపుమాపై బోవు నంతవఱకు వెనుదీయక పోరాటము జరుపవలసినదే. భయాస్పదమైన దేదియు లేదు. మన ముంగల జక్కని యనర్గళమగు రాజమార్గము గలదు.



అంతస్తపస్సు, ఉత్కాంక్ష యను దివ్యాగ్నియే యా యగ్నికణము. మానవాజ్ఞానమను నంధకారములోనికి నా యగ్నిజ్వాల లావు

వేగములు గలిగి మఱిమఱి యవరోహించు నప్పుడది యంధకారములో మునిగి లీనమైపోయినట్లు ప్రథమమున నగుపడును. అయితే యాయవ రోహణ మింతింతలైన చిమ్మచీకటిని వెలుగు గాను, మాన వాజ్ఞాన మయమగు చేతనమును నాధ్యాత్మిక చేతనముగాను మార్చును.



యోగాభ్యాసమన సర్వవ్యామోహములను ద్రెంపి భగవంతు నొక్కనిపైననే వ్యామోహము గలిగియుండు మనోబుద్ధులు, మాతృ హస్తములలో గీలుబొమ్మయను నుపలబ్ధి, నీకు జేకూరువఱకు నడు గడుగునకు భగవ దనుగ్రహమునందు నమ్మకము భగవదావేశ మనో బుద్ధులు సంపూర్ణాత్మ నివేదన ప్రధానములుగా యోగములో నభ్య సింపుము.



ఈ యోగములో భగవత్ప్రేరణమున కున్ముఖుడవై యుండుటే సర్వసిద్ధాంతము. భగవచ్ఛక్తి నీ కుపరిభాగమున దాండవ మాడుచున్నది. అట్లుపరిభాగమున దాండవించు దివ్యశక్తి యొఱుక నీకొక తూరి గలి గిన నది నీలోని కవతరించునట్లు మ్రొక్కులిడుము. ఆ దివ్యశక్తి నీ మనోవాక్కాయముల లోనికి శాంతివలెను, తేజమువలెను, నీలో గ్రీడ

సలుపు శక్తి వలెను, నిరాకార దివ్యసాన్నిధ్యమువలెను, లేక సాకార దివ్యసన్నిధానమువలెను నవరోహించును. భక్తిశ్రద్ధలతో నున్మీలనము కొఱ కాకాంక్షించిన యెడల నిట్టి యుపలబ్ధి బొందిన చైతన్యమును బడయగలవు.

ఆకాంక్ష, మొఱ, ప్రార్థన యనునవి యన్నియు నొక దాని రూపాంతరములే. ఇవన్నియు శక్తివంతము లైనవే. వీనిలో నేది నీకు లభ్యపడునో యేది సులభసాధ్యముగ నుండునో దానినే యవలంబింపుము. ఇతర మార్గ మేకాగ్రత; హృదయ కేంద్రమునందు నీ చేతన ముమ గేంద్రీకరించి యా హృదయ స్థానములో మాతను మననము చేయుము. ఆ హృదయ స్థానము నలంకరింపుమని తల్లికి మొఱలిడుము. నీవు వీనిలో నేదియైన గాని లేక వేఱు వేఱు సమయములందు రెండింటినిగాని యభ్యాసము చేయవచ్చును. ఆ క్షణమునకు నీ కేది సహజముగ గలుగునో లేక ని న్నేది తన దిక్కునకు నాకర్షించుకొనునో దానినే యనుష్ఠింపుము. ప్రారంభములో ముఖ్యావశ్యమగు విషయ మొక్కటి గలదు. అది యేదన మనస్సును బ్రశాంత మొనర్చి ధ్యాన సమయమందు సాధనకన్యమైన సంకల్ప వికల్పముల నిరసించి ప్రారద్రోలవలెను. ప్రశాంత మనస్సులో ననుభవమునకు సన్నాహము ప్రవర్ధమాన మగుచుండును. సత్వరమే సర్వము సమకూర్పబడలేదని నీవు త్రొక్కులాడవలదు. మనసులోనికి బూర్ణప్రశాంతము చేకూరుటకు

మైన సాధన భీకరశత్రువుల బ్రతిఫలింప జేయును. లేక నీచ ప్రతిపక్ష మిశ్రిత శక్తులనైన క్రింద కవతరింపచేయును. వీని విశ్లేషణచేయగల యనుభవము లేని సాధకుడు తారుమారగును. ఇట్లు కాకున్నను సాధకుడు తన మితానుభవశక్తి సామర్థ్యములను భగవన్నాయకత్వమున కారోపించును. తన మనఃప్రాణ నిర్మితములగు లక్ష్యాశయములను భగవత్ప్రసాదమనియు భావించును. వ్యక్తికి వ్యక్తికి భేదములున్నవి. ప్రతివ్యక్తికి యుక్తమగు సాధన యున్నది. అయితే సతతోన్ముల నమ్ము, ప్రశాంతమైన నిల్కడగల యాకాంక్ష, ఉబలాటములేని యుత్సాహసమన్వితములైన సహనమును, నమ్మకమును సాధనలో నీ కుపకరించునని నా యభిప్రాయము.



యుక్తతరుణము రాకమునుపే విజ్ఞానమయ కోశము లభ్యమైనదనిగాని లేక దానిని చవిజూచితిననిగాని ప్రగల్భములు పల్కుట యభావ్యము. ఇట్టి ప్రగల్భములు పలుకువారు సాధారణముగా శ్రుతిమించిన యహంకార విజృంభణమును, విచక్షణలేని ప్రమాదావలోకనమును, ధలమీదుగా దిరుగు ప్రవర్తనమును నపసవ్య వృత్తులును గలిగి యుందురు. ఒక విధమైన యాధ్యాత్మిక నమ్రత, వినయము, నిగర్వము, నిరాడంబరమైన శ్రద్ధాభక్తులు గల యాత్మావలోకనము గలిగి తన లోపము తానుగ్రహించుకొనుట యత్యావశ్యకము. ఆత్మస్తుతి, యాడం

ణరము 'నే నుడివినదే వేదవాక్య' మను స్వాభిమానము వర్జనీయములు. పేరు ప్రతిష్ఠలకు గాక భగవంతుని జేరు నిమిత్తము ప్రకృతము నీలో నున్న జీవుని పరమావిష్కారావశ్యకతను గుర్తెరుంగుటయే యీ యనిత్య భౌతిక మానవ శరీరము విజ్ఞానమయమగు మార్పు నొందుటకు మాత్రమైన లక్ష్యమని నా యభిప్రాయము.

* * *

భౌతికములోని చైత్యశరణాగతి నీయనుభవములోనికి ప్రారంభమైనది. నీసత్త యన్నిభాగములయొక్క మూలాంశము అర్పణ చేయబడినది. ఐతే యట్టి సమర్పణ సంపూర్ణము గావలెను. సత్తయొక్క యన్ని భాగములలోను వాని సమష్టి చేష్టలలోను, ప్రత్యేక చేష్టలలోను సర్వాణుచైత్య నివేదన పెంపొందుటచే శరణాగతి సంపూర్తి గాగలదు.

భగవంతునిచే గ్రీడింపబడుట యన సంపూర్ణముగా నతనికి శరణు పొందుటయే. అనగా నీ సర్వేంద్రియంబులందు నీ వనుభవించు భగవచ్ఛక్తి సామర్థ్యము లానంద తేజములు. నీ యానందము కొఱకు గాక భగవదానందము కొఱకని భావింపుము. నీవు భగవంతు నావేశించుటకంటె భగవంతుడే నిన్నావేశించుట యతిశయమైన పరమానందము. భగవంతునితో నీవు క్రీడించుటకంటె భగవంతుడు నీతో గ్రీడించుట యెక్కువ పరవశత. ఈ శరణాగతివల్ల నీవు నీ యాత్మమీదను, నీ

స్వభావము మీదను బ్రశాంతము శుభదాయకమునైన యాజమాన్యమును గూడ బొందగలుగుదువు.



చైత్యపురుషునకు నగ్రస్థానమిడి యాస్థానమునే యాతని మనుగడగా జేయుము. మనఃప్రాణభౌతికములమీద నా చైత్య సత్తాశక్తిని బ్రయోగింపుము. అట్టి ప్రయోగముచే జైత్య సత్త తన యేక దీక్షా కాంక్ష—శరణాగతులను, భక్తివిశ్వాసములను, ఆ మనఃప్రాణభౌతికములను బ్రసరింపజేయును. తేజస్సత్యములకు దూరస్థమై యహంకార మమకారములకు జోహారు లొనర్చు నీ పశు స్వభావములోని లోపములను జైత్యసత్త తక్షణమే ప్రత్యక్షముగా గమనింగొనగలదు.

అహంకారముయొక్క యన్ని రూపాంతరముల మొదలంట నరికివేయుము. నీ చైతన్యముయొక్క ప్రతివ్యాపారము నుండి దానినారు లేకుండ నాశన మొనర్పుము.

విశ్వగత చైతన్యము నభివృద్ధి చేసికొనుము. విశాలములోను, నిర్గుణములోను, విశ్వగత భగవంతునిలోను, విశ్వశక్తుల యవలోకనములోను, భగవల్లీలయైన నీ ప్రపంచ పరిణామముయొక్క జ్ఞానోపలబ్ధిలోను నీ యహంకార కేంద్రసంజని తేక్షణముల లీనము జేయుము.

నీ యహంకార స్థానమునందు నీ నిజసత్తను గనుగొనుము. అది భగవదంశము. అది విశ్వమాత నుండి వెలువడినది. పరిణామ మున కది యుపకరణమై యున్నది. భగవదంశ సంభూతుడ ననియు భగవంతున కుపకరణమనియు విఱ్ఱవీగరాదు. అహంకార సంజనిత పటాటోపములచేతను బెద్దఱికపు నాడంబరముల చేతను గామోద్భవ వాంఛితాశయముల చేతను దూషితము గాగూడదు. ఈ యంశములచే మలినము నొందిన సత్త నిజసత్తగానేరదు.

యోగాభ్యాసపరు లనేకులు ప్రాణభౌతిక కక్ష్యలలోనే లీనమై యుందురు. వారి కప్పుడప్పు డున్నత మనస్సు నుండియు, తేజోమయ మనస్సు నుండియు వెలువడు జ్ఞానవీచికల సమాగమము గలుగుచుం డును. అయితే విజ్ఞానమయపు మార్పునకు, నీవు సంసిద్ధుడవు గావలె నన్న స్వతస్సిద్ధ జ్ఞానమునకు, నతీత మనోజ్ఞానమునకు నున్ముఖుడవు గమ్ము. అవి నీ పూర్తి సత్తను విజ్ఞానమయ పరివర్తనమునకు సంసి ద్ధము చేయును. నీ చేతనము విశాలమగుటకు ప్రవర్ధమాన మగుటకు నవకాశ మిమ్ము. ఈ వివిధోర్ధ్వకోశముల జ్ఞానము నీకు క్రమేపి చేకూర గలదు.

అచంచలత, విచక్షణ, ఉదాసీనతలు (అయితే నిర్లక్ష్యముకాదు) మిక్కిలి యత్యవసరము లైనవి. ఎందుకన వీని వ్యతిరేక గుణములు శుద్ధి సంస్కార నిర్వహణములకు ప్రతిబంధకములై కార్య విలంబనము

చేయును. గాఢమైన యాకాంక్ష యుండవలసినదే; కాని దానికి జేదోడు వాదోడుగా నచంచలత, యుదాసీనత, విచక్షణ లుండవలెను. త్రొక్కు లాట వలదు. అలసత్వము, మాంద్యమును వర్జింపుము. ఉద్వేగ జనిత మగు నుబలాట, మనోసంజనిత ధైర్యవిలోలతను ద్యజింపుము. నిలక డతో గూడిన పట్టుదల గలిగియుండుము. అయితే తత్తరపాటు లేక కార్యమును సాధింపుము. ఆత్మసాక్షాత్కారమును పరువు పరువున బరు గిడి చే జిక్కించుకొన జాలవు. అది నీ యాంతర్యము నుండియు నూర్ధ్వము నుండియు వచ్చుట కవకాశ మిమ్ము. దాని కార్యరంగమును, దాని స్వభావమును దాని పరిమితిని వీక్షించుచుండుము.

నీలో మాతృశక్తి పనిచేయుటకు జోరవ నిమ్ము. కాని ప్రచ్ఛన్న వేషములతో మాతృస్వరూప మని ప్రకటించుకొను అహంకారాజ్ఞాన మిశ్రమ శక్తులు మాతృస్థాన మలంకరింపకుండ హెచ్చరిక గల్గి భద్ర ముగా నుండుము. నీ స్వభావమునందున్న యజ్ఞానమును వదలించుకొను టకు నా కాంక్షింపుము.

విజ్ఞానమయ పరివర్తనకు నీవు సంసిద్ధమగుట కివి ప్రధానమైన యంశములు. అయితే వీనిలో నొకటిగూడ సులభ సాధ్యముగాదు. ఇవి సంపూర్ణముగ జేకూరనిదే విజ్ఞానమయమగు మార్పునకు నీ స్వభావ మున కర్హత కలుగదు. సక్రమమైన దృష్టి నీలో బ్రతిష్ఠింపబడినయెడల నీ శుద్ధి సంస్కారము శీఘ్రగమనము దాల్చును. సరియైన దృష్టి నవ

లంబించి యా దృక్పథమునందు బట్టుదలతో నిలిచియుండు టొక్కటే నీవు చేయగల్గిన సహాయము. సాధారణ పరిణామమున కిదియే సహాయభూతము.

# III

## కష్టములందు

యోగారంభ దశలందు గష్టములు మెండు. అభివృద్ధియు గుంట్లు గలిగియుండును. నీలోని పురుషుడు సంసిద్ధుడగుటకు, నీలోని కవాటములు తెఱువఁ బడుటకుఁ గాలయాపన మగును. నీకు ధ్యాన సమయములయందు నంతర్జ్యోతి మెఱుపులు పొడగట్టుచు, నంతర్ముఖాకర్షణ ప్రదులుచు, బాహ్యము నందభిరుచి క్షీణించుచుఁ గామనయొక్క తారుమారొనర్చు నొత్తిడి కృశించుచున్న యెడల గొప్ప యభివృద్ధి బొందినట్లు భావింపవలసినది. యోగ మార్గము కడు దీర్ఘమైనది. అడుగడుగునకు నాటంకములు తటస్థించు చుండును. వానితోఁ బోరాడి జయ మొందవలెను. కష్టములయందు, గాలవిలంబనము నందు, నానావిధ విఘ్నములందు, ధైర్యము, చలించని భక్తిశ్రద్ధలు, తదేకదీక్షగల పట్టుదల ఇవి సాధకుని కన్నిటికంటె నత్యవసరమైన సంపత్తులు. సాధన ప్రథమ దశలందు నాటంకములు సర్వసాధారణముగా గల్గును. ఏ స్వభావమునకు దగిన సంగ్రహణశక్తి లేకుండుటచే నాటంకములు తటస్థించు

చున్నవి. ఆ ప్రతిబంధకములు మనఃకక్ష్యకు సంబంధించినవో లేక ప్రాణకక్ష్యకు సంబంధించినవో నీవు పరిశోధింపవలెను. అట్టి క్లేశోత్పన్నస్థానముల గనుగొని యా స్థానమునందే నీ చేతనమును విశాలమొనర్పబడుటకు గృషి సల్పుము. ఎక్కువ శాంతి పవిత్రతల కాకాంక్షింపుము. అట్టి శాంతి పవిత్రతలలో త్రికరణ శుద్ధిగా నీ ప్రతికూల భాగమును భగవచ్ఛక్తికి బూర్ణముగా నేలాటి కృత్రిమము లేక యర్పణ చేయుము.



స్వభావములోని ప్రతిభాగము దాని పూర్వ వాసనలనే యనుసరించుటకు వాంఛించును. సంపూర్ణమగు మార్పునకు గాని యభివృద్ధికి గాని నీ స్వభావ మియ్యకొనక దాని శక్త్యనుసారము వికసించును. ఎందుకన దాని ప్రత్యేక రాజ్యమందు దాని నిరంకుశాధికారమునకు భంగము వాటిల్లుచున్నది. ఈ కారణము వల్లనే శుద్ధి సంస్కారము దీర్ఘముగాను గష్టతరము గాను బరిణమించుచున్నది.

మనస్సు తమోభావమును బొందుచున్నది. ఎందుకన భౌతిక మనస్సు దాని యుపాధిగా నున్నది. తమస్సు లేక మాంద్యము భౌతికము యొక్క ముఖ్యతత్వము. ఈ మనోభాగ మనర్గళోన్న తానుభవముల ధారను భరించలేక యలసి, శ్రమనొంది మాంద్యము వహించు

చున్నది. ఈ మాంద్యము నుండి విముక్తి నందుటకు సమాధియే తరుణోపాయము. సమాధ్యవస్థ యందు శరీర మచలత్వ మొందుచున్నది. భౌతిక మనస్సొక విధమైన నిద్రావస్థలో మునుగుచున్నది. అందువలన లోపలి చేతన తన యనుభవములలో నోలలాడుటకు నిరాటంకముగా నుండును. సమాధి యోగమున కపరిత్యాజ్యమైన యెడల జాగ్రదవస్థ యొక్క బాహ్యచేతన సమశ్య పరిష్కరింపబడ జాలదు. అది మాలిన్యముతో గూడుకొని యుండవలసినదే. సమాధి యందీ లోటు అంతర్భూతమై యున్నది.



ధ్యానకాలమందు నా నానేక సంకల్ప వికల్పములు వచ్చుచున్న యెడల నవి ప్రతిపక్ష శక్తుల కృత్యములు గావు. మానవ మనస్సు యొక్క సాధారణ స్వభావము వల్లనే యవి గలుగుచున్నవి. సాధకుల కందఱ కీ కష్టములు తప్పవు. అనేకుల నీ కష్టములు దీర్ఘకాలము విడువక బాధించు చుండును. వీనిని వదలించుకొనుటకు గొన్ని మార్గములు గలవు. అందులో నొకటి యేదన సంకల్పముల నీక్షించుచు వానిని బట్టి మానవ మనస్సు తత్వమును నీవు బరికించుట. అయితే యా సంకల్పముల వెనువెంట నీవు పరుగిడుటకు సంకల్పింపకుము. వివేకానందులు తన రాజయోగ మార్గమునందు జూపిన దిదియే. మఱియొక మార్గమేదన—సంకల్ప వికల్పములు నీవిగావని యుపలక్షించుచు, సాక్షి పురు

షుని వలె నిర్లిప్తుడవై యా సంకల్ప వికల్పములకు నీ యనుమతిని నిరాకరింపుము. అవి బాహ్యము నుండియు బ్రకృతి నుండియు వెలువడి వచ్చుచున్నట్లు బరిగణింపుము. వానిని నీమాన సాకాశమునందు సంచారముచేయు బాటసారులవలె భావించి వానితో నేలాటి సంబంధ బాంధవ్య నిమిత్తములు లేనట్లు మెలంగుము. ఈ విధముగా గొంత కాల మాచరించిన మనస్సు రెండు విధములుగా విభజింప బడుచున్నది. చలనరహితమై సాక్షీ స్వరూపముగా నుండి వీక్షించు భాగమొకటి; సంకల్పముల సంచారము గలిగిన ప్రకృతి భాగము మఱియొకటి. ఈ ప్రకృతి భాగమే మొదటి భాగమునకు ధ్యేయమైనది. తరువాత ప్రకృతి భాగమును నిశ్శబ్దపరుచుటకు వీలగును. మూడవ మార్గము కడు శీఘ్రగమనముగల పద్ధతి. ఈ పద్ధతియందు నాలోచన లేవైపుననుండి ప్రసరించు చున్నవో యని తిలకించినయెడల నవి తననుండికాక తన శిరస్సు వెలుపలి భాగము నుండి వెలువడుచున్నట్లు నీచేఁ గనుగొనబడును. అట్టి రహస్యమును గుర్తెఱిఁగిన తదుపరి నవి నీలోనికి బ్రవేశింపక మునుపే, వానిని గెంటి వేయుము. ఈ పద్ధతి యన్ని పద్ధతులకంటె నధిక కష్టతరమైనది. అందఱి కందరానిది. అయితే దీనిని సాధింపగలిగిన యెడల ఫల మధికము గను గష్టము స్వల్పముగను నుండును. ఇది శక్తి యుక్తమగు దగ్గఱి త్రోవ.

నీలో నవసవ్యమైన వృత్తులను దిలకించి తెలిసికొనుట యత్యావసరము. ఎందుకన నవి నీ వ్యాకులతకు గారణభూతములై

యున్నవి. నీవు వానినుండి విముక్తి బొందవలెనన్న వానిని మాటి మాటికి బహిష్కరించి పారద్రోలవలెను.

ఐతే నీ లోపములను నపసవ్యవృత్తులను గుఱించి సతతము మననము చేయకుము. నీవు నిర్ణయించి చేరదలచుకొను లక్ష్యము మీదనే తదేకధ్యానము నిలుపుము. అది నీ గమ్యస్థానమైనందునఁ 'దప్పక చేరగలను, చేరితీరగల' నను దృఢవిశ్వాసము గలిగియుండుము. ఎల్లప్పుడు లోపముల గురించియు నపరాధముల గుఱించియు జేయబడు చింతన జుగుప్సకు, భక్తిశ్రద్ధలయందలి యపనమ్మకమునకు గారణమగును. ముందరికాళ్ళయందున్న చీకటివైపునకు నీ దృష్టిని బ్రసరించుటకు మారుగా రానున్న వెలుగువైపునకు రెట్టింపులుగా నీ దృష్టిని మఱలింపుము. శ్రద్ధాభక్తులు, ఉత్సాహము, తుద్దతుదకు దప్పక జయముగలుగునను నమ్మకము, సహకారమొసంగును. ఈ చతుష్టయము నీకు శీఘ్రాభివృద్ధిని జేకూర్చగలవు.

నీకు మున్ను సంప్రాప్తమైన శుభదాయకమగు నను భవము గూర్చి యింతింతలుగాఁ బ్రస్తుతించుకొనుము. అట్టి యనుభవమొక్క టైనను నూటొక్కపతనములకంటెనెక్కువయని భావింపుము. అట్టి హర్షోద్భవానుభవ మంతర్ధానమైన దానికొఱకై విలపింపకుము. జుగుప్స నొందకుము, దిగులు పొందకుము. ఐతే లోన శాంతి వహించి యట్టి యనుభవము మిక్కిలి గాఢముగాను బూర్ణముగాను దిరిగి

సంభవించునటులాకాంక్షింపుము. ప్రతిక్షణ మాకాంక్షింపుము. శాంతిగలిగి భగవానునికి సంపూర్ణముగా సమాయకుడవై యున్మీలుండవు గమ్ము.



మానవ నికృష్టప్రాణము మిక్కిలి హేయమైన లోపముల చేతను వృత్తులచేతను నిండియున్నది. ఇవి ప్రతికూలశక్తులకు ప్రతిధ్వనించుచున్నవి. సతతము చైత్యసత్త్వోన్మీలనము, మాటిమాటి కపరశక్తుల ప్రేరేపణల బహిష్కరణ, ప్రతిపక్షపుసలహాలకు విముఖత్వము, పరాశక్తియొక్క శాంతిపవిత్రతేజముల యవరోహణ తుట్టతుదకు నీ చెరను ఛేదించి దగ్ధముచేయగలవు.

అత్యావశ్యకమైనది శాంతి. ఆ శాంతి కొంతంతలైన నీప్సితమే. తుచ్ఛపు ప్రేరేపణలు నీవి గావని తలంచుము. అవి పిలువనిపేరంటము చెప్పని యొక్కప్రొద్దన్నట్లు సిగ్గుబిడియములు లేక నీ చెంతకుఁ బరుఁగులిడుచున్నవి. వానిని నిరాకరించి నీనుండి భిన్నముచేయుము, భగవచ్ఛక్తియందు నమ్మిక గల్గి యట్టినమ్మికయందు స్థిరమతివై యుండుము. నీ చైత్యసత్త భగవంతునినర్థించిన, నీ మనస్సేలాటి జంకుకొంకులు లేక నిష్కపటముగా నీ నీచస్వభావము నుండి విడుదలకు నాక్రందించిన నీ హృదయము మాతృశక్తి సాన్నిధ్యములకొఱకుఁ బరితపించిన, నీవు స్వశక్తిమీద నాధారపడక

మాతృశరణ్యముమీదనే మొనకొనిన, నీ యపరశక్తుల ముట్టడి తుట్ట తుదకుఁదుత్తునియలగును. శాంతి బలము లపరశక్తి స్థానమునలంక రించును.



నికృష్టస్వభావ మజ్ఞాన మయమైనది. అది దైవసంభూత మైనది కాదు. స్వాభావికముగా నది దైవవిరోధియుఁగాదు. అయితే సత్యమునకుఁ దేజమునకది గ్రుడ్డిదిగానున్నది. ప్రతిపక్ష శక్తులు దైవ విరోధులు, అవి దైవీసంపత్తునకు బ్రతిపక్షములగుటే గాక మానవ పశుస్వభావమును వశపరచుకొని యాపశుస్వభావమును దలక్రిందుఁజేసి యవకతవక వృత్తులతో నింపి యందుమూలమున మానవుని బ్రేరేపించుచు వానినెత్తిమీద గాపురము సలుపుచుండును.

అప్రమేయమైన అతిశయోక్తులతో గూడిన ఆత్మదూషణల వర్జింపుము. పాపభీతివల్లను, గష్టములవల్లను, బతనమువల్లను గలుగు జుగుప్సనుండి విముక్తినొందుము. ఈ భావములు నీకెల్లప్పటికి మేలొనర్పఁజాలవు. ఇవి నీ యభివృద్ధికి నడ్డుతగులు నాటంకములుగా బరిణమించుచున్నవి. ఈ భావములు మతసాంప్రదాయక మునకు సంబంధించినవి. యోగసాంప్రదాయకమున కివి దూరస్థ ములు. యోగసాధకుఁడు స్వభావలోపములన్నియు నందఱికి సామాన్య

మరియు నవి యపర ప్రకృతి చేష్టలనియు భావించును. వానిని ప్రశాంతముగా స్థాయిగల్గిన పట్టుదలతో భగవచ్ఛక్తి యందుఁ బూర్ణమగు నమ్మకముగలిగి బహిష్కరించి తరిమివేయుచుండుము. ఇట్టి యనుష్ఠానములో సాధకుఁ డబలత్వమునుగాని, జుగుప్సనుగాని యజాగ్రత్తనుగాని జూపక, యుద్వేగములేక, విసుగునొందక, చీదరించుకొనక యుండవలెను.



యోగపద్ధతి యేమన విచారము వ్యాకులతలు సంభవించినపుడు జానిసపగిది నీవు వానికి లొంగక పెడమొగముదాల్చి, యట్టి వ్యాకులతలకుఁ గారణము గుర్తెఱిఁగి వానిని నశింపజేయుటయే. ఎందుకన సర్వవ్యాకులతలకుఁ గారణములు మనలోనే పాదుకొని యున్నవి. ఒకవేళ కామనలో దాగియున్న లోపమో, యపసవ్యభావ మననమో వానికిఁ గారణములుగా నుండనోపును. లేక క్షుద్రపుగోరికల సంతృప్తివలనఁగాని యసంతృప్తివలనగాని గల్గిన ప్రతిఫలముగా నుండవచ్చును. యోగములో నిష్ఫలమందిన క్షుద్రపుకోరికకంటె సఫలమందిన కోరికయు నీచప్రవృత్తుల మననము ఎక్కువ సంకటమును బాధను గలుగఁజేయుచున్నవి.

నీవు ముఖ్యముగఁ జేయఁదగిన దేమన నీయాంతర్యమందు మిక్కిలి లోతైనస్థానములో బాదేర్పరచుకొని యాస్థానమునందే మని యుండుట. తుచ్ఛపుసంకల్పములకు గుఱియైన నీ బాహ్యప్రాణమనస్సులం దుండియు లేనట్లు సంచరించుచుండుము. నికృష్టస్వభావము నీ ఆంతర్య చైత్యసత్తదాపునకు బోజాలదు. చైత్యసత్త జన్మతః భగవంతునికి సామీప్య మందున్నది. నిజసత్త కన్యములైన క్షుద్రబాహ్యప్రవృత్తు లను బైపై మెరుగులుగాఁ జైత్యసత్త తిలకించును.

* * *

నిన్ను నిమగ్నుఁజేయు కష్టపరంపరల, నపసవ్య నీచప్రవృత్తుల నీ స్వభావములో నంతర్హితమైనట్లును అవి నీ స్వకీయములైనట్లును బహుశః నీవు భావించుచున్నావు. అది పొరఁబాటు. వానికిఁ బెడ మొగమై తిరుగుము. వాని మైత్రిని విడిపించుకొని దూరముగానుం డుము. అవి నికృష్ట విశ్వచేతనముయొక్క చేష్టలు. ఈ నికృష్ట శక్తులు నీలోఁబ్రవేశించి వాని క్రీడార్థము నిన్నొక యుపకరణముగా నుపయోగించుటకుఁ బ్రయత్నించుచున్నవి. వానిబారినుండి వెలువడి బంధవిముక్తుఁడవైన నీ యంతస్సత్తను లేక చైత్యసత్తను నన్వే షించుటకు, దానిలోమనియుండుటకు నీకుఁ గడు సులభసాధ్యముగ నుండును. చైత్యసత్తమీఁదికి నికృష్టశక్తులు దండెత్తఁజాలవు. అవి దానిని బంధింపఁజాలవు. చైత్యసత్త వానిని దనకన్యమైనదిగాఁ గనుఁ

గొనుచున్నది. ప్రయత్నములేకయే చైత్యసత్త నికృష్టశక్తులకుఁ దన యనుమతిని నిరాకరించుచున్నది. చైత్యసత్త యుత్తమచేతనభూమిక లతో సంబంధ బాంధవ్యములుగల్గి భగవంతుని లీలలో నిత్యయోగము కల్గియున్నది. నీ సత్తలో నట్టిసుఖసమన్వితమగు శాంతినిలయమును గనుగొనిఁ యందులోనే మనియుండుము. అట్టిది చేయఁగలిగితివా యోగములో నీకుఁ జక్కని నిజమైన పాదు దొరికినట్లగును.

సూత్రధారుని పగిది వెనుక నిలువఁబడినయెడల బాహ్యకోలాహలముచాటున నీలోనున్న, చైత్యసత్త హాయిగల స్థానము గుర్తెరుంగుటకు నీకు సులభసాధ్యమగును. ఆ కేంద్రమునుండి నీ చెర విముక్తికొఱకు సహాయ్యమును జయప్రదముగా నర్థింపగలవు. భగవంతుని సాన్నిధ్యస్థిరత్వములు, శాంతిపవిత్రతలు, శక్తితేజములు, ఆనందవిస్తరణలు నీకు స్వాగతమిచ్చుటకుఁ గామధేనువుపగిది కాచుకొనియున్నవి. చాటుననున్న చైత్యసత్త స్థిరత్వమును చేఁజిక్కించుకొమ్ము. అటులైన నీ మన స్సచలత్వము నొందును. అట్టియచలమనోద్వారమునుండి శాంతిపవిత్రతలు నీలోనికిఁ బ్రవహించుటకు మొదలిడును. తదుపరి భగవచ్ఛక్తికొఱ కాకాంక్షించుము. ఈ శాంతిపవిత్రతలు నీలోనికి దుముకుచున్నట్లు నీకు గోచరించిన నవి నీలో శాశ్వతముగాఁ బాదుకొనునంతవఱకు మఱిమఱి వాని కాహ్వాన మిడుము. నీ ప్రవర్తన మార్పుకొఱకు నీ చేతన పరివర్తనకొఱకు మాత కృషిసలుపుచున్నట్లు నీకు భావన గలుఁగును. ఈ కార్యకలాపము

నందు మాతృశక్తి సాన్నిధ్యముల యెఱుక నీకుఁ గలుగును. ఒక్కటూరీ యనుభవము సంప్రాప్తమైన తక్కినదంతయుఁ గాలమే నిర్వర్తించఁగలదు. నీలో దైవస్వభావము దినదిన ప్రవర్ధమానమైన పరిణామము నొందును.



లోటుపాటులున్నను, అవి యెన్నియైనను నెంతహేయమైనను యోగమునం దభివృద్ధి కవి శాశ్వతమైన యాటంకములను గలిగింపఁజాలవు. (ముందటి యనుభవమే చేకూరునని నే నుడువుటలేదు. నా యనుభవముప్రకారము కష్టానంతరము సంభవించు ననుభవము సాధారణముగా నూతన రూపముదాల్చి విశాలముగా నుండును.):—ఏదో విశేషచేతనముగను నింతకుఁ బూర్వము సంప్రాప్తమైన దానికంటె నతిశయముగానుండును,....కష్టపరిస్థితుల మధ్యకాలమునందు యోగానుభవమును జూపునకుమాత్రమే జారిపోయినట్లుండును. యోగాభివృద్ధికి స్థిరమైన యాటంక మశ్రద్ధ యొక్కటియే. అదిగూడ నలంఘనీయముగాదు. కొంతకాలమున కది మారగలదు. ఇట్టి యశ్రద్ధ నీలో గలుగఁలేదు. లోపములే యోగాభ్యాసమున కలంఘనీయములగు వాటంకములైన నే మనుజుఁడుగూడ యోగములో నుత్తీర్ణుఁడు గాఁజాలఁడు. ఎందుకనఁ బ్రపంచములో లోపములేని మనుజుఁ డరుదు. నేను జూచినంతవరకు యోగమున కత్యద్భుతశక్తి గలవారే శతకోటి

కళంకములు గలిగియుండిరి. సోక్రటీసు తన ప్రవర్తనము మీఁదఁ జెప్పిన వ్యాఖ్యానము నీకు తెలియునని తలఁచెదను. తద్విధము గనే గొప్ప యోగీశ్వరు లనేకులు వారివారి పూర్వ స్వభావముల గుఱించి వక్కాణించి యున్నారు. యోగములోఁ గడపటి వఱకు లెక్కింపఁదగి నవి శ్రద్ధాభక్తులు. వానికిఁ దోడు యోగమార్గమునందే గాలూనుకొను నంతటి సహన మవసరము. చాలమంది యీ సహనము లేకయే యోగ ములో ముందుకు సాగుదురు. ఎందుకనఁ దిరుగుబాటు, జుగుప్స. అధై ర్యము, అలసట, యీ నాలుగు తాత్కాలికపు లక్షణములు. భక్తిశ్రద్ధ లలోటు నీ కెంతయున్నను నీ బాహ్య స్వభావమున కంటె నెంతెంతో మిన్నయైన నీ యాత్మ శక్తి, నీ యాధ్యాత్మిక తృష్ణ, నీ కారుమబ్బు లను జీకట్లను బిచ్చలు పిచ్చలుగా విచ్ఛిన్నము లొనర్చి వాని గమ్యస్థానము నకు వి న్నీడ్చుకొని పోవును. లోభములు గొప్ప గుండములుగాఁ బరిణ మించి యా క్షణమునకు మాత్రమే గొప్ప విఘ్నములఁ గలుగఁజేయ గలవు. ఐతే యా విఘ్నములు శాశ్వతమైన యాటంకములు గాఁజాలవు. యోగ మార్గమునకు నీ స్వభావ మియ్యకొనక వికటించుటచేఁ గల్గెఁడు నాటంకములు కాలయాపనమునకు గొప్ప కారణములుగాఁ గలవు. గాని యీ వికటత్వము దీర్ఘ కాలము మనఁజాలదు. నీకుఁ గల్గిన దీర్ఘ తమ స్సును గారణముగాఁ జేకొని నీ వసమర్థుఁడ వనియు నాధ్యాత్మిక విధి కనర్హుఁడ వనియు విశ్వసింపకుము. ఎందుకన సర్వత్ర యోగుల యను భవములో నుత్సాహ నిరుత్సాహ కాలములు రేయింబగళ్ళవలె వచ్చుచుఁ బోవు చుండును. ఇందుకు మినహాయింపు చాల నరుదు. ఇట్టి సన్ని

పేశములకు హేతు వేమని విచారణ సలిపిన — (ద్రొక్కులాడు మనుజ స్వభావమునకు మిక్కిలి చీకాకు.) :— ముఖ్యముగా రెండు తేలు చున్నవి. మొదటి దేమన మానవ చైతన్యములోనికిఁ దేజశ్శక్త్యానంద ములు తఱుచుగాఁ బ్రవహించిన నుత్తర క్షణమే యది సహించుకొనఁ జాలదు. లేక యట్టి శక్తుల స్వీకరించిన తక్షణమే జీర్ణించుకొనఁజాలదు. జీర్ణించుకొనుటకుఁ గొంత సావకాశము గావలసి యున్నది. బాహ్య చేత నము తెరవెనుక నీ జీర్ణసంస్కారము జరుగుచున్నది. సాధ్యమైన యను భవము యొక్క యుపలబ్ధు లీ తెరచాటున విశ్రమించి బాహ్యచేతనమును బీడుగా విడిచి నూత నావరోహణమునకు సంసిద్ధ మొనర్చు చున్నవి. యోగములో నెక్కువ యభివృద్ధిఁ బొందిన దశలందుఁ గలిగెడు నాత్మ జ్ఞాన మీ చీకటి కాలములను సన్నంబులుగను, స్వల్ప శ్రమాస్పదములు గను జేయును. ఇదిగాక యిట్టి యున్నతాత్మజ్ఞాన మీ క్షణమే నీ యభి వృద్ధి కుపకరింపక పోయినను ఇది నీ బాహ్యచేతనమున కాధారముగా నుండి దానిని బోషించుట వలన నున్నత భావమందు నీవు విశ్రమింపఁ బడుదువు. రెండవ కారణ మేమన ముందటి యనుభవముచే స్పృశింపఁ బడని నీ స్వభావములోని కొంతభాగ మాధ్యాత్మికపు మార్పునకు సిద్ధము గాక యుండవచ్చును. లేక యట్టి మార్పున కియ్యకొనక యుండ వచ్చును. అట్లియ్యకొనక తిరుగుబా టొనరించిన భాగము మనస్సంజని తమగు దృఢాభ్యాసములో, లేక కామోద్భవ వాంఛితములో లేక తాత్కా లికమైన భౌతిక తమస్సో కారణముగా నుండును. ఇట్టి కారణములు రహస్యముగనో బట్టబైలుగనో యాటంకముల నొడ్డుచుందుము. ఈ

యాటంకములకుఁ గారణము నీలోనే యున్నందున నట్టికారణము నన్వేషించి కనుఁగొని దాని పోకడలను దిలకించుచు దాని నిర్మూలనముకొఱకు భగవచ్ఛక్తిని నారాధించి సహాయ్య మర్థించుము. అప్పుడు దాని యంధకార కాలములు సన్నగిలి యొత్తిడి కృశించును. ఎటులైనను భీతిల్లకుము. అన్ని సందర్భములలోను దెఱచాటున భగవచ్ఛక్తి యెల్లప్పుడు తాండవించుచున్నది. కనుక నెప్పుడో యొకవేళ తలపని తలంపులుగా నాటంకములు ప్రబద్ధలగును. చీక ట్లంతర్థానము లగును. తిరిగి తేజః ప్రకాశములు విరాజిల్లును. ఇట్టి సందర్భములో నుత్తమ పద్ధతి యేమన నీవు సాధింపఁ గలిగిన యెడలఁ జీకాకుఁజెందక దిగులొందక పట్టుదలతోఁ బ్రశాంతముగా నున్మీలుఁడవై తేజమున కఱ్ఱుఁజాచి దాని రాకకు శ్రద్ధాభక్తులతో నిరీక్షించుచుండుట. ఇట్టి సాధనవల్లఁ బరీక్షా సమయములు కొఱవడుట నేను గనుగొని యున్నాను. ఆ యాటంక మంతరించిన తదుపరి గొప్ప యభివృద్ధి చేకూరినట్లు గనుఁగొందువు. ముందటికంటెఁ జైతన్యము యొక్క పరిగ్రహణ సంచయ శక్తులభివృద్ధిబొందినట్లు గూడఁ గనుఁగొందువు. ఆధ్యాత్మిక జీవితములోని పరీక్షలకుఁ బోరాటములకు బహుమానము గలదు.

*
* *

దివ్య శక్తి యొక టున్నదని విశ్వసింపఁబడుటకును, అట్టి దివ్య శక్తి కనుగుణ్యముగా నీ స్వభావము మార్పఁబడుటకుముందును నీ

స్వభావములోని మాలిన్యములు నీ కెరుకఁ బడవలసినది వాస్తవమేగాని ఈ మాలిన్యములను, వీనిచేతఁ గల్పితములగు కష్టములను గొండంతలఁ జేయుటగాని, యట్టి కష్టానుభవముల యందు భగవచ్ఛక్తిని గొలఁదిపర చుట గాని, వెన్నెల రాత్రుల మఱచి చీకటి రాత్రులనే పెద్దచేయుటగాని సరియైన వైఖరిగాదు. ఇట్టి వైఖరి కష్టముల ద్విగుణీకృతముఁ జేసి వానిని బహుకాలము వర్ధిల్లజేయును. 'సర్వము శ్రేయస్కర' మను మెట్టవేదాంతము తప్పక యనుసరణీయమని నా వాదముగాదు. సర్వ మనర్థ మను వైఖరిలో మునుగుట కంటె సర్వము మంగళకరమను భావనలో నోలలాడుట యెక్కువశ్రేయోదాయకము. ఇట్టి భావన కష్ట ముల మఱుపునకుఁ దెచ్చును. ప్రతి విషయములోను దగుపాటి పరిమి తిని బాటింపవలెను. నీ యిడుములను నిక్కట్లను మఱచి యతి శయా నంద భావనలో నుండుటవల్లఁ బ్రమాదమేమియు సంభవింపదు. ఇం దుకు విరుద్ధముగ నీవు మేల్కొన్నది మొదలు నిద్రించువఱకు మైపీడలను బోలు ఖేదములను నిత్యములైనట్లు మననము చేయుచుఁ బరితపించు చున్నావు. ఇట్టి మననము కష్టముల ద్విగుణీకృతము చేయుచున్నది. మఱియు నివారణోపాయముగూడ నీ కగమ్యగోచరముగా చేయుచున్నది. కనుక నీ మార్గము రాజమార్గము గాదు. శ్రద్ధాభక్తు లావశ్యకములు. కొంచెము గొప్పలు గాక. నూటికి నూరుపాళ్ళు కావలసి యున్నవి. పీ సంభావ్యములందు దృఢనమ్మకము, స్థూల దృష్టి కగోచరమై వీలో వర్తించుచున్న భగవచ్ఛక్తిపైఁ బూర్ణవిశ్వాసము, సాధించి తీరవలసిన సంస్కరణపైఁ బట్టుదల, ప్రసాదింపఁ బడిన నాయకత్వముపై నమ్మ

కము నీ కావశ్యకములు. విడువక గట్టి పట్టుదలతో పోరాడి నాటం కముల నెదుర్కొనజాలని యే యుద్యమము గూడ గొప్ప యుద్యమము గాఁజాలదు. అందులో విశేషించి యాధ్యాత్మిక రంగమందు బాహ్యాంతర కష్టములు మెండుగా నుండును. ఈ కష్టములు మొత్తముమీఁద నాధ్యాత్మిక సాధకు లందఱికి నొకే విధమున నున్నను వారి రూపాంతరము లందును, నొత్తిడులందును విశేషభేదము లుండవచ్చును. సర్వులకు నిజమైన చిక్కొక్కటే గలదు. అది యేమన భగవత్తేజశ్శక్తుల కార్యకలాపములకు స్వభావముల ననుగుణ్యముఁ జేయుట. అట్టి యానుగుణ్యముచేఁ జిక్కులన్నియు నంతర్థానము నొందును. లేక సందు మూలలకుఁ జొచ్చును. సర్వసాధారణమైన క్షష్టములు దీర్ఘకాలము మనినను నవి పరివర్తనా సంస్కారము నం దిమిడి యున్నందున వానిని విశేషముగా లెక్కింప నవసరము లేదు. ఎందుకన నీ శుద్ధి సంస్కరణలందుఁ గంటికి తెప్ప చందమున విన్నాదరించు పరాశక్త్యుపలంభనము. ఈ యుపలంభనము వెనువెంట రానున్న యతిశయశక్తి నీ కుత్సాహ ధైర్యముల నొసంగును.



ఆంతర్యమం దొక విధమగు సమాధిలోఁ గలిగిన యనుభవము బాహ్యస్మృతి గలుగఁగనే యంతర్థాన మగుచున్నది. ఏలయన బాహ్యాంతర చేతనములు విడఁబడి యున్నవి. వీని మధ్య పరాచేతనము సేతు

బంధన మొనర్చినప్పుడు బాహ్యచేతనము గూడ నాంతర్యానుభవములను జ్ఞప్తియం దుంచుకొనును.

* * *

ఆకాంక్ష తీవ్రతలోను సాధనాశక్తిలోను హెచ్చుతగ్గులు తప్పని సరిగా సంభవించు చుండును. పరివర్తనమునకు స్వభావము సంపూర్ణముగా సంసిద్ధియగువఱకు యంతరాయములు సాధకుల కందఱకు సాధారణముగాఁ గలుగుచుండును. చైత్యసత్త ముందు కరుదెంచినపుడు లేక కార్యావేశుఁడై నప్పుడు నాతనికి మనఃప్రాణములు చేయూత నొసఁగిన సాధన తీవ్రగమనము దాల్చును. చైత్యపురుషుఁడు నీలోఁ బ్రముఖత్వము వహింపక వెనుక ముందు తడవు లాడుచున్నప్పుడు, మఱియు నికృష్ట ప్రాణము తన మామూలు వృత్తుల నవలంబించినపుడు, లేక మనసు తన యజ్ఞాన కార్యకలాపములందుఁ బ్రవర్తించినపుడు సాధకుఁడు జాగరూకతతో మెలంగని యెడలఁ బ్రతిపక్ష శక్తులు వానిలోనికి చొచ్చుకొనును. సాధనలో నీ కామన తోడ్పడక ప్రతిముఖము దాల్చిన భౌతిక చేతనములో మాంద్యము అలసత హెచ్చుఁబెఱుఁగును. సత్త యొక్క వివిధ కక్ష్యలలోనికిఁ బరాచైతన్యము మాటిమాటికి నవరోహింపఁబడిన నీ దోషములు నివారణ కాఁగలవు.

* * *

జుగుప్సయు వ్యాకులతయు నందుటకు నప్పుడప్పుడు, చేతన భ్రంశించినపుడు, తటస్థించు చుండును. ఇందుకుఁ బలువిధములైన కారణములు గలవు. కొన్ని బాహ్యము నందుండి నిన్ననుసంధించును. పరాచైతన్యముచే స్పృశింపఁబడని కామనలో గొంతభాగము దానికిఁ గారణముగా నుండవచ్చును. కొన్ని భౌతిక స్వభావముయొక్క మాంద్యము నుండి జనింపవచ్చును. వ్యాకులతకుఁ గారణములు నీలో నంతర్భూతములై యున్నవి. కనుక ప్రశాంతమైన మనస్సుతో మాత కున్ముఖుఁడవై నీ వ్యాకులతకుఁ గారణభూతమును వ్యక్తీకరింపఁగల జ్ఞాన చక్షువును బ్రసాదింపు మని మాత నర్థింపుము.



ఆరోహ ణావరోహణముల కార్యములమధ్య కాల విలంబము లుండును. మధ్యాగతమైన యనుభవమును సత్త జీర్ణించుకొనుటకుఁ గాను నూతనానుభవమునకు నీ స్వభావ మాయత్తపడుటకుఁగాను గాలయాపనములు జరుగుచున్నవి. సాధనలో నీ యంతరాయములను నిర్హేతుకములైనవిగాభావించి చీకాకుఁబడవలదు. ఇదిగాక మాతృశక్తి నీ స్వభావముయొక్క యుపరి భాగమును దనవెనువెంట నిడికొని యారోహణమొనర్చి క్రిందికక్ష్య నుద్గమింపఁ జేయుట కవరోహించును. ఈ యారోహ ణావరోహణములు మిక్కిలి చీకాకుగాఁగన్పట్టును. ఎందుకన మన స్సంతరాయముల సహింపనొల్లదు. నిరాటంకముగాఁ దన లక్ష్యమును జేరుటకు నఖిల

షించును. ప్రాణము తటతట ఫలసిద్ధికి నువ్విళ్ళూరును. ఇట్టి మనః ప్రాణములు మాతృశక్తి యొక్క గూఢచర్యల నన్వయించుకొనలేక చీదర పడుచుండును. సంపూర్ణ స్వభావముయొక్క పరివర్తనము సులభముగా నిర్వర్తింపఁ బడఁజాలదు. ఈ పరివర్తన కార్యమును నిర్వర్తింపఁగల మాతృ శక్తిసామర్థ్యము లపారములు. నీ యజ్ఞానమయ మనస్సు కంటెను, నీ త్రొక్కులాడు ప్రాణము కంటెను ఆ శక్తి - జ్ఞాన - తేజో - బలములు వేయి మడుంగు లెక్కు వనుట నిస్సందేహము.



కేంద్ర సంకల్ప రహితమైన యోగము దుస్సాధ్యము. కేంద్ర సంకల్పము ప్రకృతి శక్తుల తరంగముల కన్నిటికి మిన్న. ఆ కేంద్ర సంకల్పము మాతతో సతత సంయోగము గలిగి యుండుటచేత నది నీ స్వభావమును దన కేంద్ర లక్ష్యాకాంక్షలకు గుఱిచేయు చుండును. అట్టి కేంద్ర సత్తయందుఁ బాదుకొని యుండుటకు నీ వింతవఱకు వర్క పించి యుండలేదు. అందువలన నీపైకి దండెత్తివచ్చు నికృష్ట శక్తులను వివక్షత లేక యనుసరించి, బానిస పగిది పరుగిడుటకు నలవాటు పడి యా నికృష్ట శక్తులతో నైక్యమగుచున్నావు. ఈ యభ్యాసమునకు మొదట స్వస్తి చెప్పవలెను. చైత్యపురుషుని నాధారముగాఁ జేకొని కేంద్ర సత్తను గనుగొని దానిలోనే మనుఁగడ గలిగి యుండుము.

పోరాట మెంత ఘోరమైనను ఇప్పు డిక్కడనే తుదివఱకు విడువక వల్పవలసిన కర్తవ్యము.

నీ వింతవఱకు నిన్నుఁ బ్రతిఘటించు నాటంకము జయించి యుండలేదు. అదియే సంభవించిన చిక్కు నీ మూల ప్రకృతిని నావ రించుకొన్న యహంకారము తన గర్వమదాంధతలతో. నాశయములతో నీ యాధ్యాత్మి కాకాంక్షను దూషితము చేయుచున్నది. ఈ యహంకార రూపాంతరము బ్రద్దలగుటకు సమ్మతించనందున దివ్య సత్యానుభవములు నీకుఁ బెడమొగములు వహించియున్నవి. మాత తన శక్తిని నీ లోనికిఁ బ్రసరింపఁ జేసినపుడు లేక మాతృశక్తిని నీవు నీలోని కవతరింపఁ జేసి కొనినప్పు డట్టి శక్తి తన యిష్టానుసారముగా నీలో వర్తింపకుండున టుల నీ యహంకార మడ్డుతగులు చున్నది. ఈ యహంకారము నీ బుద్ధి కనుసరణీయముగనో లేక నీ యహంకారేచ్ఛకు ననుగుణముగనో స్వయం నిర్మాణమునకు మొదలిడినది. స్వకీయ బలముతోను, స్వకీయ సాధనతోను, స్వకీయ తపస్సుతోను దనకుఁ దోఁచిన విధమున స్వయం సృష్టిని జేయుటకుఁ బ్రయత్నించుచున్నది. ఇందులో నే నాడుగూడ నిజ మైన శరణాగతి నాస్తి. దివ్యమాతృ హస్తముల లోనికిఁ దలజాచి నిన్ను నీవు జంకులేక యర్పణఁ జేసికొని యుండలేదు. ఈ విజ్ఞానమయ యోగమునం దుత్తీర్ణతకు శరణాగతి యొక్కటియే యమృతోపమానమైన సదుపాయము. యోగీశ్వరులుగను, సన్యాసులుగను, తపస్సంపన్నులు గను బరిఢావ మొనర్పఁబడుట గాదు ఈ యోగలక్ష్యము. నీ స్వభావ

పరివర్తనమే దీని గమ్యస్థానము. అట్టి పరివర్తనము నీకంటె నెన్నిమడుంగులో నతిశయాతిశయమైన యలపరాశక్తి వల్లనే చేయఁబడును. నీవు దివ్య మాతృ హస్తములలోఁ బసికూన చందమున వాస్తవముగా దోగాడునప్పుడు మాత్రమే నీలో నీ పరివర్తనము చేయబడుటకు వీలగును.



యోగములో విజయము దుర్ఘటమని నిరాశఁ జెందుట కెట్టి కారణములును గనుపట్టవు. ప్రకృతము నిన్ను క్రుంగఁ జేయునట్టి జుగుప్స తాత్కాలిక మైనది. అట్టిది మేటి సాధకుల కొకప్పుడు గాకపోయిన నొకప్పుడు, లేక తఱచుగను సంభవించుచుండును. కర్తవ్య మొక్కటియే గలదు. నీ స్వభావములో జ్ఞానోపలబ్ధి బొందిన యంశము నస్థాయియైన యాదరువుగా జేకొని దానియందే మనియుండుము. ఇందుకు వ్యతిరేకమైన సలహాలను నిరసించుచు వేచియుండుము. ఈ క్లిష్ట పరిస్థితులును, జుగుప్సకు గారణభూతములైన ప్రమాదములును అంతర్ధాన మగువఱకు దివ్యశక్తికి శక్తివంచన లేక యర్పితుఁడవై యుండుము. ఈ యోగమునకు 'నీ కర్హత లేదు. పూర్వపు లౌకిక జీవితమునకే మఱలి పొమ్ము', అని నిన్ను ప్రేరేపణ జేయు శక్తులు నీ ప్రతిపక్ష శక్తులని గ్రహింపుము. ఈ లాటి యభిప్రాయములు [illegible] కృత్రిమము లని యెఱిఁగి సర్వవేళల వానిని బహిష్కరింపుము. ఈ

నికృష్ట స్వభావము దాల్చు మోసపు రూపము లజ్ఞానమయ మనస్సును నకారణముగా నమ్మఁ బలికించినను వాస్తవములో నా కారణములు సత్యమునకు దూరస్థములు. ఎందుకన క్షణభంగురమైన యంశమును నతిశయము జేసి మార్పులేని నిర్దిష్ట సత్యముగా నికృష్ట స్వభావము చిత్రించుచుండును. నీలో నొకేయొక సత్యము మాత్రమే కలదు. దానినే పట్టు విడువక సతతము ప్రాపుగాఁ గలిగి యుండుము. నీలో నంతర్భూతములై యున్న దివ్య సాధ్యతలు, ఉన్నతతర జ్యోతియొక్క సందేశము లా యమోఘ సత్యములు గానున్నవి. అట్టి సత్యము నీవు సతతము నమ్మి నీవు పట్టు విడువక యనుసరించుము. ఒకవేళ నట్టి పట్టప్పు డప్పుడు సడలి పెడత్రోవ త్రొక్కినను నీవు దిగులొందక మొదటి మార్గము వైపునకే మఱిమఱి మఱలి రమ్ము. ఎన్నో కష్టముల నిక్కట్టుల బితవములనైన పరకుచేయక యీ సత్యము నిన్ను తుట్టతుదకు సమర్థించి కాపాడ గలదు. నీ యాధ్యాత్మిక స్వభావము ప్రవర్ధమానమగు కొలది నీకు ప్రతిముఖమై తిరుగుఁబా టొనర్చిన దంతయు నకాలములో నంతరించును. ప్రాణ తత్త్వముయొక్క పరివర్తనము శరణాగతు లత్యవసరములు. తుచ్ఛపు ప్రేరేపణలకుఁ గోరికలకు నీ కామన కిలోదకముఁలొస గవలెను. నీ కామన దివ్యసత్యము కొఱకే పరిపించవలెను. ప్రాణసత్త్వయొక్క యిట్టి కూటమియే యాధ్యాత్మిక జీవిత సర్వస్వభావమునకు సంపూర్ణ సంప్రీత్యానందములను గలుగ జేయును. ఇట్లు మార్పు జెందిన ప్రాణసత్త్వయొక్క సంయోగము నీ కలవడిన మామూలు జీవితమునకు నీవు తిరుగు మొగము దాల్చుట కల

లోని వార్త. ప్రాణసత్త కిట్టి మార్పు కలుగుటకు మనో నిశ్చయము చైత్యసత్తాకాంక్షయు నీ కండగా నుండవలెను. నీవు పట్టు బట్టి దీక్ష వహించిన ప్రాణసత్త తుట్టతుదకుఁ బరివర్తనమొంది శరణాగతి పొంద గలదు. ఎద్దానికి గాక దివ్య సత్యమునకు మాత్రమే జీవిత సర్వస్వము వినియోగించుటకు నీ మనో హృదయములఁ జిక్కఁబట్టి ప్రోత్సహించుము. ఇందుకు వ్యతిరిక్తములైన విషయముల నిరసించుము. తుచ్ఛపు కోరికలఁ ద్రుణీకరించి వానికిఁ బెడమొగము దాల్చుము. ఇతర శక్తికిఁగాక భగవచ్ఛక్తికి మాత్రమే యుస్మీలుఁడవు గమ్ము. అప్పుడే నీ కగత్యమైన సజీవమైన సహాయము తప్పక పొందఁగలవు.



నీ వవలంబించిన దృష్టియే సరియైన దృష్టి. నిన్నుఁ దలముణకలుగా ముంచి సత్యమార్గమునకు దూరస్థునిగా జేయునట్టి శక్తుల బాధనుండి యింత శీఘ్రముగా గాపాడఁ గల్గిన దీ శక్తియే. నీవు వుడివిన రీతిగా గష్టముల నా విధముగా స్వీకరింప బడిన నవి యవకాశములుగా బరిణమించు చున్నవి. కష్టములను సక్రమమైన దృష్టితోను సరియైన భావముతోను నెదుర్కొని జయించిన నాటంకము లంతరించుచును. మఱియు నీవు ముందంజ వేసిన వాడ వగుదువు. అంతరంగికముగున సంశయములు, స్వభావములో నంతఃకలహములు కష్ట పంక్తులములఁ బెంపొందఁ జేయును. అందుకొఱకే శ్రీకృష్ణ పొందుట దేశము

యోగములందు గురువాక్య మలంఘనీయ మనియు, జవదాట రానిదని, లేశమాత్రము సంశయింపక విశ్వసనీయమని నపరిత్యాజ్యమనియు శాసింప బడియున్నది. గురుహితార్థమునకుఁ గాక శిష్యుని కళ్యాణము కొఱకే ఇవి విధింప బడి యున్నవి.



విషయములను దిలకించుట యొక కార్యవిశేషము. ఆ విషయముల పై లోనికిఁ బ్రవేశపెట్టుట ప్రత్యేక కార్యము. తిలకించుటకు, గమనించుటకు, చైతన్య కేంద్రమునందు నా విషయముల సమీక్షణ మొనరించి వాని తత్వము నెఱుంగుటకును వానికి మన యనుభవములో స్థానమిడుట యుక్తమే గాని ప్రవేశ మిడి నమస్కృతు లిడుటకు నే కారణము కనుపించదు. భగవంతునికి మాత్రమే లేక భగవంతునిచే బ్రసాదింపఁబడిన దానికి మాత్రమే స్వాగత మిడి పూజింపుము. వెలుఁగు లన్నియు శోభాయమానము లని నుడువుట సర్వ జలములు లేక స్ఫటికము రీతి గనిపించు నిర్మల జలము లన్నియు బానీయార్హము లని సంబోధించి నట్లుండును. అట్టిది సత్యముగా నుండనోపదు. ఆ వెలుగు యొక్క నిత్యానిత్యముల నిర్ణయించుటకు బూర్వము దాని యుత్పత్తి స్థానమును, దాని స్వభావమును, దాని గుణగణములను బరీక్షింపవలెను. దబ్బర వెలుగులు తప్పు ద్రోవలకు ద్రిప్పు ప్రకాశములును గలవు; పత్తయొక్క నికృష్ట భాగములకు జెందిన తుచ్ఛపు వెలుగులు గూడ

గలవు. కనుక హెచ్చరికతో గూడిన విచక్షణ గలిగియుండుము. నీ చైత్య స్వభావములును, ననుభవములును, మనస్సును బవిత్రమగు కొలది సత్య విచక్షణ జ్ఞానము పెంపొంద గలదు.

నీ వాలకించిన ప్రలాపము భౌతిక హృదయము లోనిది కాదు, అయితే యది భావ కేంద్రములోని విలాపము, కుడ్య విచ్ఛిన్నము చేయుట యనగా నీ బాహ్యాంతర సత్తల మధ్యనుండు నాటంకముల శిథిల మొనర్చుట, మనుజు లనేకులు, వారి సర్వసామాన్యమగు వజ్ఞాన మయ బాహ్యమూర్తిలోనే మనుగడ గల్గి యుందురు. ఆ బాహ్యమూర్తి సులభముగా భగవంతునికి వికసితము గానేరదు, కాని నీలో నంతస్సత్త యనునది యొకటి గలదు. దాని యునికి నీ కమ్యగోచరముగా నున్నది. అది దివ్య సత్యమునకు వెలుగునకు సులభముగా వికసితము కా గలదు. అంత స్సత్తనుండి నిన్ను మరుగుచేయు గోడయొకటి గలదు. అది యంధకార మయమగు జడత్వము దాల్చిన కుడ్యమువలె నున్నది. ఆ కుడ్యము తుత్తునియలైన విముక్తి గలదు. నీకు సంప్రాప్తములైన శాంత్యానంద సంతోషములు-అట్టివి ముక్తియొక్క ఫలములే. ఆ కుడ్య మాకస్మికముగా బటపట విరుగుటచే జయింప బడిన ప్రాణతత్త్వము యొక్క రోదనమే నీ వాలకించిన యార్తనాదము.

* * *

సాధారణముగా శరీరములో చైతన్యము బంధీకృతమైయున్నది. శిరో హృదయ నాభీచక్రములందు చైతన్యము కేంద్రీకరింప బడి యున్నది. నీ చైతన్య మూర్ధ్వమునకు ప్రకోపించి శిర స్సుపరిభాగమున దాని స్థాన మేర్పరచు కొన్నట్లు నీ కనుభవము గలిగిన యెడల శరీర సూత్రములో జెర గొన్న చైతన్యము విముక్తి పొందుచున్నదని భావింపుము. అట్లూర్ధ్వమునకు ప్రకోపించినది నీలోని మనస్తత్వమే. అది యూర్ధ్వము నందున్న విశేష మనస్సుతో సంయోగము నొందుచున్నది. ఆ యూర్ధ్వ స్థానమునుండి తాను బొందిన విశేషశక్తిచే నీ స్వభావము లోని యితర తత్వములను పరివర్తనమునకు పురికొల్పు చున్నది. నీకు గలిగిన పణకు-అత్యుష్ణము- ఈ విముక్తికిని, పరివర్తనమునకును వలవాటుపడని నీ ప్రాణశరీరములు ఘర్షించుటచే సంభవించి యున్నవి. మన చైతన్యము శాశ్వతముగా నీ విధమున నూర్ధ్వమునందు దన స్థానము నేర్పరచుకో గలిగిన, లేక నీ యిచ్ఛానుసారము మన సృష్టి స్థానము చేర గలిగిన ప్రథమ ముక్తి లేక సిద్ధి పొందినట్లు భావింపుము. అట్టి యూర్ధ్వస్థానమున నీ మనస్సత్త యున్నత భూమికలకు గాని, విశ్వగత చైతన్యమునకు గాని, విశ్వ శక్తులకు గాని యనర్గళముగా వికసితము గాగలదు. అతిశయాతిశయ స్వేచ్ఛతోను, సామర్థ్యములతోను నీ విక్షిప్త స్వభావముపై నధికారమును ప్రయోగించ గలదు.

*
* *

దివ్యపరిణామము, శాంతి సమరస పద్ధతుల ననుసరించును గాని ప్రమాద ప్రళయరూపముల దాల్చనేరదు. ఉద్దండ ప్రళయ రూపము లన్యోన్య ద్వేషపీడితమైన ప్రాణ శక్తులచే గలుగుచున్నవి. కాని నీ స్వభావపు నికృష్టపు భూమికల మీదనే యిట్టి పోరాటము జరుగు చున్నది.

ప్రతిపక్షశక్తులగుఱించి మితిమీరి చింతించుచున్నాము. ఇట్టి చింత లేనిపోని యారాటములను జనింపజేయును. సుగుణముల మీద నీ మనస్సును కేంద్రీకరించుము. తల్లి శక్తికుస్మిఁ దవుగమ్ము. ఆమె రక్షణకొఱకు మొరలిడుము. తేజశ్శాంతిస్థిరతలు, దివ్యపవిత్రత, జ్ఞానచైతన్యములు నీలోఁ బెంపొందునట్లు ఆకాంక్షింపుము.

పరిశోధన యను భావము శ్రేయస్కర మైనదికాదు. అట్టి భావమును బెద్దచేయఁదగదు. పరీక్షలు భగవంతునిచే విధింపబడియుం డలేదు. నికృష్టభూమికలకుఁ జెందిన మనఃప్రాణభౌతికము లీ పరీ క్షలఁ గల్పించుచున్నవి. అట్టి పరీక్షలు భగవంతునిచే అంగీకరింప బడుచున్నవి. ఎందుకన నీ పరిశోధనలు ఆత్మశిక్షణ విధానములో నొక భాగముగా నున్నవి. జీవాత్మ నిజస్వరూపము, మరియు పతని శక్తులు నీ కెఱుకపడుటకుగాను, జీవాత్మని లోపములనుండి విముక్తి చేయఁబడుటకుఁగాను నీ పరీక్షలు విధింపఁబడియున్నవి. మాత నిన్నుఁ బ్రతిక్షణము పరీక్షలకు గుఱిచేయుటలేదు. అందులకు మాయగాఁ గన్న

ముల బారినుండి నిన్నుద్ధరించుటకు నడుగడుగున నీకు సహాయ్య మిడుచున్నది. నిన్నుఁ గష్టములపాలుఁజేసి పరీక్షలకు గురిచేయుచున్నట్టి ప్రతిపక్షశక్తుల దాడినుండి విముక్తిపడుటకు మాత సహాయ్యము నీకుఁగల దను నెఱుక సతతము గలిగియుండుటే యుత్తమ రక్షణ.

*
* *

ప్రతిపక్షశక్తులు స్వకీయముగాఁ గల్పించుకొన్న కొంత పెత్తనము గలదు. ఆధ్యాత్మిక శక్త్యవరోహణమునకు, నాధ్యాత్మిక సిద్ధికి నీ చైతన్యము యొక్కయు, భౌతికముయొక్కయు నర్హతలను బ్రతిపక్షశక్తులు పరీక్షించుచున్నవి. ఆధ్యాత్మికమార్గప్రయాణమునందుఁ బ్రతియొక్కయడుగున నీ ప్రతిపక్షశక్తులు శరవేగముతో నీ పైకి దండెత్తుచున్నవి. తప్పులెన్నుచున్నవి. "తిరుగుబా టొనరించు" మని ప్రేరేపించుచున్నవి. జుగుప్సలో బలవంతముగా నిన్ను ముంచుచున్నవి. ఎదిరింపుమని ప్రోత్సహించు చున్నవి. అపనమ్మకములను గల్పించుచున్నవి. కష్టముల గుట్టలుగుట్టలుగాఁ బేర్చుచున్నవి. వానికున్న యిసుమంత యధికారమును నింతింతలు చేయుచున్నవనుటలో సందేహములేదు. గోరంతలు కొండంతలుగా చేయుచున్నవి. తృణప్రాయమైన తప్పటడుగుగాని పొరపాటుగాని పడినయెడల నవి నీ త్రోవలోఁ బ్రత్యక్షములై యడ్డము మహా మేరుపర్వతమువంటి యాటంకము నొడ్డుచుండును. కాని కేవలము మనలఁబరిశోధించుటకుఁ బరీ

క్షించుటకు నీ నికృష్టశక్తులకు భగవంతు డనుగ్రహమొసంగలేదు. రెట్టింపగు బలమును సంపూర్ణాత్మజ్ఞానమును నతిశయాతిశయమైన గాఢమగు పవిత్రతాకాంక్షలను, ద్విగుణీకృతములైన యభేద్యములగు భక్తిశ్రద్ధలను, భగవత్కటాక్షమును నిర్బంధవిధానముననైన నువ మర్దించి పొందవలెనని భగవంతుఁడీ ప్రతిపక్షశక్తుల మనస్కరించి యున్నాడు.

* * *

నికృష్టశక్తులఁ బ్రకోపింపఁజేయు నుద్దేశ్యముతో శక్తి నీలోని కవరోహించుటలేదు, కాని ప్రకృతము దివ్యశక్తి నీలో నుండు సాధన విధానమునకు బ్రతిచేష్టగా నికృష్ట శక్తులారంభించు చున్నవి. కర్తవ్యమేమన స్థిరత పొందిన చైతన్యమును నీ స్వభావములో నెల కొల్పుట. అట్టి స్థిరత విస్తరతలఁ గాంచిన స్వభావము నికృష్టస్వ భావము చెలరేగినప్పుడు దానితో మెడపట్టు పట్టక యతిరయమి రం దమున జీవరథములోని లోటుపాటులఁ దిలకించుచు వానిఁ గ్రమ క్రమముగా దిద్దుబాటుఁ జేయుచుండుము.

* * *

అజ్ఞానమయ శక్తులు బాహ్యమునుండి [illegible] ద్ధము లగును. విన్నణగద్రొక్కి చెరఁగొ[illegible]

ములతో నలుదిక్కులం గ్రమ్ముకొని నీపై దాడిసలుపును. అట్టి దండయాత్రలో నీకుం గలుగు ప్రతివిజయము నీ స్వభావములోని మాలిన్యమును శుభ్రముచేయును. మనఃప్రాణభౌతిక భూమికలలోని మాతన ప్రదేశములందు, లేక నీ స్వభావమును బరివేష్టించియున్న ప్రదేశమందు ఇట్టి విజయములు మాత ప్రభుత్వమును బ్రబలముచేయును. ఇంతకు ముందు నిన్ను మట్టుంబెట్టుచున్న యీ చెరల నీవు లెక్కింపక యెదుర్కొనుటలో నీ ప్రాణశక్తియందు మాతృతాండవము పెంపొందుచున్నట్లు తేటతెల్లమగుచున్నది.

క్లిష్టకాలములందు మాతృశక్తి సాన్నిధ్యముల నర్థించంగల నిపుణతయే కష్టముల నెదుర్కొనునట్టి యమృతోపాయమగు తరుణోపాయము. సర్వకాల సర్వావస్థలయందును నీలో నంతర్హితమై నీకుతోడు నీడగా నుండు మాతతో సంభాషించు చుండుము. తూచాలు తప్పకుండ వామె మాటలకింపుటయే చేయదగిన కర్తవ్యము. అట్లాలకింపుటవలన యే ఇతరధ్వను లామె ధ్వని ననుకరింపంజాలవు, లేదా మీ ఇరువురిమధ్య ప్రవేశింపనూజాలవు.

* * *

నీ చైత్య మనస్సత్త లాధ్యాత్మిక లక్ష్యముమీందనే యేకాగ్రత వహించి దైవమునకు వికసితములై యున్నవి. అందుచే దైవశక్తి సౌహార్దయముల వరకే ప్రసరించియున్నది. కాని నీ భౌతికప్రాణ

సత్తులు నికృష్టస్వభావ ప్రేరేపణలకు నధీనములై యున్నవి. నీ ప్రాణభౌతికశక్తులు శరణుఁబొందునంతవరకు, లేక యున్నతాశయములు గల జీవితము నపేక్షింప నంతవఱకు బోట్లాట సామాన్యముగా నంతరించదు.

నీ సర్వస్వమును భగవంతునికే నివేదనఁజేయుము. ఇతరేతరములగు కోరికల నాశయములఁ బరిత్యజింపుము. నీ ప్రాణమును వికసింప జేయుమనియు నీయన్ని కేంద్రముల లోనికి శాంతి–స్థిరత–తేజానందములఁ బ్రసరింపఁ జేయుమనియు దివ్యశక్తికి మ్రొక్కిడుము, ఆకాంక్షించుము. శ్రద్ధాభక్తులు గలిగి ఫలసిద్ధికి వేచియుండుము. అనన్య భక్తిశ్రద్ధల పైనను బూర్ణాకాంక్ష నివేదనలపైనను సర్వమాధారపడియున్నది. నీలోఁ బ్రాపంచికబంధ మణుమాత్రమున్నను అది నిన్ను బంధించును. సంపూర్ణముగా నీవు భగవంతునికి దాసానుదాసుఁడవైనగాని బంధవిముక్తుఁడవు గాఁజాలవు.

* * *

జీవితమును అందులో నిమిడియున్న కష్టపరంపరలను ధైర్యసాహసములతోను, బట్టుదలతోను, సహనముతోను నెదుర్కొనజాలిన మనుజుడెట్లు సాధనలో నంతర్భూతమైన యతిశయాతిశయమైనది కష్టముల నెదుర్కొనఁగలఁడు? సంసారమును అందులోని యెుదు

దుడుకులను బ్రశాంతమనస్సుతో, జలించని ధైర్యముతో భగవచ్ఛ క్తిమీఁద సంపూర్ణవిశ్వాసాధేయతలు గలిగి యెదుర్కొనుటయే యీ యోగములో నభ్యసింపవలసిన కేవలము ప్రథమ పాఠమైయున్నది.



ఆత్మహత్య సదుపాయమని యూహించు బుద్ధిహీనతకంటె వేరొండు లేదు. దానిచే శాంతిచేకూరునని చింతించువాడు వట్టియప్రయోజకుఁడైన మూర్ఖుడు, ఆత్మహంతకుడు, తనకష్టముల శిరమున మూటగట్టుకొని నికృష్టలోకములకేగి మరల నిహమం దామూఁటతోనే పునర్జన్మ మెత్తుచున్నాడు. తరుణోపాయ మొక్కటే గలదు. ఇట్టి పిచ్చిపిచ్చియూహల నణచి కర్తవ్యకర్మ జీవిత పరమావధి యని దృఢముగా నమ్మి విలకడగల ధైర్యసాహసముల నవలంభించి జీవయాత్రను గడుపుము.



ఇహదారిగా యున్నప్పుడే సాధన చేయదగునుగాని దేహమంతరించినప్పు దేమి చేయనగును? శరీర మంతర్థానమైన నాత్మ పరలోకములో సంచారములునలిపి తుట్టతుదకు మఱియొక దేహమును దాల్చి యిహమందు జన్మించును. ముందుజన్మలో నీదేర్చనట్టి కష్టములు

తిరిగి యీ జన్మలో ప్రత్యక్షమగును. కనుక శరీరపరిత్యాగము వలన సాఫల్యమేమిగలదు ? ఇదిగాక శరీరమును బుద్ధిపూర్వకముగా త్యజించినవారు పరలోకమున ఘోరయమయాతనలకు గురియగుదు. మఱియు బుణ్యయోనుల జనింపక పాపయోనుల జనింతురు.

ఈ జన్మలోనే మఱియు నీ కళేబరములలోనే సర్వకష్టముల నెదుర్కొని జయమందుటయే చక్కని రాజమార్గము.

యోగ గమ్యస్థానము చేరుట బహుకష్టతరము. ఈ యోగ మన్నియోగములకంటె దుర్ఘటమైనది. ప్రమాదముల బతనముల నెదుర్కొనుట కెవ్వనికి శక్తిసామర్థ్యము లుత్సాహములు కలవో. మఱియు నహంకార మమకారములను నిశ్శేషముగాత్యజించి శరణు జొచ్చుట కెవ్వరికి నిచ్ఛగలదో యట్టివారికే యీ యోగము దక్కుత గలదు.

నీకును మాతృశక్తికిని మధ్య నెవరికిగాని యెద్దానికిగాని యేలాటి స్థానమొసంగకుము. నీవాశక్తితో నిత్యసంపర్కము గలిగి యామె దివ్యాదేశముల కనుగుణముగా బ్రవర్తించుము. నీ మనస్సంజనితాభి ప్రాయముల నిరసించు చున్నయెడల దప్పక జయము పొందగలవు. ఇతరోపయోగములు గల యాలోచనలు వ్యూహములు సహితము

సత్యాదాయకములైన ప్రేరేపణలపైనను, భావనలమీదను శక్తిమీదను నాధారపడనియెడల విఫలమొందును.

*
* *

అపనమ్మకములు అవిధేయతలు కష్టములకు మూలములై యున్నవి. ఎందుకన నవికూడ ననృతముల వంటివే. అవి దబ్బర యభిప్రాయములపైనను ప్రేరేపణలపైనను, నాధారపడి యున్నందున నవి కూడ ననృతములే. మాతృశక్తి నిరాటంకముగా స్వేచ్ఛగలిగి తన యిష్టానుసారము నీలో వర్తించకుండునటుల నీ యపనమ్మకములు అవిధేయతలు నడ్డుతగులుచు మాతృ రక్షణా శక్తిని క్షీణింప జేయును.

ధ్యానసమయములందే గాక బాహ్యవ్యాపారములందుగూడ నీవు సరియైన దృష్టి నవలంబించవలెను. సవ్యమైన దృష్టిగలిగి మాత కనుసన్నలలో మెలిగినయెడల గష్టము లంతరించ మొదలిడును. లేక సులభోపాయముగా గష్టములనుండి గట్టెక్కగలవు. పరిస్థితు లను హాయిగా పరిణమింప గలవు.

నీ ధ్యానములో నేవిధముగా వర్తించెదవో తద్విధముగనే బాహ్య వ్యాపారము లందును ఇతరేతర కార్యకలాపములందును ప్రవర్తిం

పము. మాతకునీ్మలాడపై సర్వ మామె నాయకత్వమునకే యప్పగించి యామె ప్రశాంతిని, నామె యదారక్షణశక్తిని, నామె రక్షణల నర్థిం చుము. ఇట్టి మాతృశక్తులు నీలో వర్తించకుండునటుల నడ్డుదగులు తుచ్ఛప్రేరేపణలను గల్పించు జాగరూకతలేని యపసవ్యవృత్తులను జేష్ట లను బహిష్కరించుము.

ఈ సూత్రము నీ వనువర్తించిన నీ యావత్తు సత్తలోగల యన్యోన్య కలహపీడనములును వివిధరాజ్యములు నశించి యాదరణ తేజశ్శాంతములతో సమృద్ధమైన మాత ఏకచ్ఛత్రాధిపత్యరాజ్యము నీలో నెలకొల్పబడును.



ఆత్మజ్యోతికి, భగవదాజ్ఞకు దాసత్వమవసరమని నేనుదువుటలో నీ పూర్వచారిత్రములోని విషయముల గాని నీ లోటుపాట్లగాని సూచిం చియుండ లేదు. అన్ని ప్రమాదములందును నాటకములందును ముఖ్యా వశ్యకతనుగూర్చియే నొక్కిపల్కి యున్నాను. ఏవిధమైన సలహాలను ప్రేరేపణలను నూకొట్టక తిరస్కరింపుము. సత్యసందేశమును 'రా ర' మ్మని పిలుచు వెలుగు చేసన్నలను దుచ్ఛపు భ్రమలకు నెదురొడ్డుము. అన్ని సంశయములందును జుగుప్సలందును, "నేను భగవంతుని దాసు డను. నాకపజయమనునది లేదు" యనిపల్కుము. 'అనవస్థితవు

అపవిత్రుడవు. అని యెత్తిపొడుచు ప్రబోధములకు "నేను భగవంతునిచే నేరి యెన్నుకొనబడిన నాశరహితమైన యమృతరసముయొక్క శిశువును. నాకు నే నసత్యుడను గాజాలను. భగవంతునికి సత్య దూరుడను గాజాలను, జయము తప్పక సిద్ధించును. ఒక వేళ విఘ్నము మూడిన బునః ప్రయత్నము తప్పదు" అని బదులిడుము. ఈ యాధ్యాత్మిక మార్గమునకు స్వస్తిచెప్పి తుచ్ఛలక్ష్యములకు సేవాతత్పరుడవు గమ్మని గుసగుసలుపల్కు ప్రేరేపణలకు "ఈ మార్గమే యున్నతోన్నతమైనది. నా యాత్మతృష్ణను నీ పరమసత్యమే చల్లార్చగలదు. ఈ దివ్యయాత్ర యంత్యమువరకు నెన్నియేని యిడుములనైనను బరిశోధనలనైనను సహింపగలను," అని మారుపలుకుము. ఆత్మజ్యోతికి భగవదాజ్ఞకు బద్ధుడైన వాని ప్రవర్తన యిట్టిదని నా వ్యాఖ్యానము.

IV

## ఆశ - ఆహారము - విషయలంపటు

సర్వసాధారణమైన కామ వ్యాపారములు నిజసత్త కన్యము లైనవి. అవి బాహ్యమునుండి జనించి వచ్చుచున్నవి. అవి నిజసత్త కాత్మీయములైనవి గాని దానిలో సంజనితములైనవిగావు. అవి ప్రకృతి నుండి చెలరేగు తరంగములు.

కోరికలు బాహ్యమునం దుద్భవించి యధచ్చేతనప్రాణములో నికి జొరబడి మీదికి దలలెత్తుచుండును. అవి పైకి నిక్కిచూచినప్పుడు, మఱియు వానిని నీ మనస్సు గుర్తించినప్పుడుమాత్రమే ఆ కోరికల యనుభూతి నీకు గలిగి అట్టివానిని స్వకీయములని భావించుచున్నావు. ఏలనన ప్రాణతత్త్వమునుండి మనస్తత్త్వములోని కుద్గమించు నపుడు మాత్రమే నీకు గలుగుచున్నది. అవి బాహ్యమునుండి నీ యధచ్చేతన ప్రాణములోనికి చొచ్చుకొన్న పైనను నీవు గుర్తెఱుంగుటలేదు. అం దుకు నీ యాత్మగాని ప్రాణతత్త్వము గాని, కోరికగాని [illegible]

గాజాలవు. విశ్వప్రకృతినుండి తరలివచ్చు ప్రేరేపణా తరంగములను ప్రతి ధ్వనించు నీ యలవాటే దీనికి గారణకర్త.

ఇట్లు ప్రతిభాషించు నలవాటు లేక యనురాగమును నిరసించుటచే కోరికను బహిష్కరించగలవు. ఇట్టి యలవాటు లేక యనురాగము నీ స్వభావమునకు మరియు నీ నిజాత్మకు స్వకీయముకాదనియు, నన్యమైనదనియు భావించి నీ చైతన్యమునుండి యట్టి యలవాటును వెలుపలకు గెంటుటయే బహిష్కరణమని చెప్పబడుచున్నది. కోరికలమనసా మననము చేయుచు నానందించుట కూడ నీ బహిష్కరణ సాధనలో నిషిద్ధము. కోరికలు ప్రేరేపించుకార్యము లశాస్త్రీయములైన నట్టి కార్యముల పరిత్యాగము కూడ యోగశిక్షణలో ముఖ్యాంశముగా నున్నది. మనః సన్యాస సిద్ధాంతముగనో లేక కఠిన నైతికపద్ధతిగనో యీ సాధనమ ననుష్టించినయెడల నట్టిది కోరికను చంపుటయే యన బరగును. కాని బహిష్కరణ యనబడదు. కోరికలను చంపెడి సాధన సక్రమమైనవిధానము కానేరదు. మనోనిగ్రహమునకు లేక నైతికవిగ్రహమునకు నాధ్యాత్మిక శుద్ధికి మధ్య నెంత తారతమ్యము గలదో అంత తారతమ్యము కోరికలను చంపెడి విధానమునకు అంతర్య బహిష్కరణ విధానమునకును గలదు.

నీవు నిజమైన చైతన్యములో మనుగడగలిగి యున్న గోరికలు నీకు బాహ్యముగా నున్నట్లు గ్రహింపగలవు. మఱియు నవి బహి

ర్ముఖమైయున్న విశ్వాపరప్రకృతినుండి యీ మనఃప్రాణములలోనికి గూడ ప్రవేశించుచున్నట్లు కనుగొనగలవు. సర్వసామాన్య మానవ స్వభావములో నీవు మనియున్నప్పు డీకోరికల యుత్పత్తిస్థానము నీకు గోచరము కాజాలదు. కోరికలు నీ యాంతరమందు జొరబడి నివాస మేర్పరచు కొన్నప్పుడు మాత్రమే వాని యునికి నీవు గుర్తించుచున్నావు. అందువలన నీవు కోరికలను స్వకీయములనియు, నీ యణువులో నణువనియు దలచుచున్నావు. కోరికలనుండి విముక్తి బడవలెనన్న నిజచైతన్యానుభూతియే మొదటి నియమము. నిజచైతన్యానుభూతి నీకుఁ గలిగిన గోరికల సులభసాధ్యముగా నీ స్వభావమునుండి నెట్టివేయగలుగుదువు. అటుగాక కోరికలు నీ స్వభావములో నంతర్హితములైనట్లు భావించినయెడల వానిని నీనుండి గెంటివేయుట బహుప్రయాసకరముగ నుండును. స్వభావములో మిళితమైనవానిని వదలించుకొనుటకంటె శరీరముయొక్క త్రుప్పును వదలించుకొనుట యతి సులభము.



చైత్య పురుషుడు నీలో గార్యనిర్వహణమునకు మొదలిడినప్పుడు గూడ గోరికలనుండి విముక్తివడుట సులభసాధ్యముగ నుండును. ఎందుకన చైత్యపురుషునికి స్వకీయమైన వాంఛలు లేవు. భగవదన్వేషణాకాంక్ష వ్యామోహములే యాతని పంచప్రాణములు. చైత్యపురుషుని

నీలో బ్రహ్మత్వము వహించుకొలది నిజచైతన్యము నీలో బహిర్గతము కాగలదు. ఆ నిజచైతన్యము స్వభావచేష్టల నప్రయత్నముగా బహిష్కరింపఁగలదు.

*
* *

వాంఛితములు మఱియు నాశయము లొకదానియొక్క రూపాంతరములే. భావాకృతి యాశయముగా బరిణమించుటలో నారాటము తత్తరపాటు గలగవలసిన యవసరము లేదు. అందుకు మారుగా నీ భావాకృతి నీలో స్తిమితముగా నెలకొనగలదు. లేక విడువక మాటిమాటికి ప్రత్యక్షము గాగలదు. వాంఛగాని యాశయముగాని మనసునుండియో లేక కామమునుండియో యుద్భవించుచున్నది. చైత్యపురుషుని యావేదనకును లేక యాధ్యాత్మికతృష్ణకును గామోద్భవవాంఛలకును లేక మనస్సంజని తాశయములకును హస్తిమశకాంతము గలదు. చైత్యపురుషుడు వాంఛింపడు, ఆశింపడు. వాడాకాంక్షించును. ఆతని శరణాగతి యవ్యాజమైనది. ఉత్తరక్షణమే తన యాకాంక్ష సఫలీకృతము గానియెడల వెనుకంజ వేయడు. ఎందుకన చైత్యపురుషునికి భగవంతునియందు లేక గురువునందు నన న్యభక్తి విశ్వాసములు గలవు. ఋతుకాలము వరకు లేక భగవదనుగ్రహము గలుగువరకు నోపికతో నిరీక్షించగలడు. చైత్యపురుషుక కాత్మీయమైన పట్టుదలగలదు. ఆతడు భగవంతునకు భారముగాన

నీ స్వభావమునకే భారమగును. ఉపలబ్ధికి ప్రతిముఖమైన నీ స్వభావలోపముల మీద తన దివ్యమగు వెలుగును ప్రసరింపజేయును. నీ యనుభవములలో, నీ యనుభవపుబోకడలలో, లేక నీ యజ్ఞానమయ విషయములలోగల లోపములను జైత్యపురుష డెంచి యేర్పరచి గాలించును. అహంకార రూపాంతరముల నన్నిటినుండి నీ స్వభావము విముక్తి బడయువరకును, భగవంతునికి సంపూర్ణముగా నీ సత్త వికసితమయి శరణుబొందువరకును, అన్ని విషయములందు సరియైనదృష్టి నీ వవలంబించువరకును జైత్యపురుషుడు సంతృప్తి జెందడు. సర్వస్వభావము విజ్ఞానమయమగు మార్పునకు సంసిద్ధమగుటకు మున్ను మనఃప్రాణభౌతికములందిట్టి చైత్త్యోపలబ్ధి గలుగవలెను. అట్టి చైత్త్యోపలబ్ధి గలుగనియెడల నీకు మనఃప్రాణభౌతిక కక్ష్యలందసంపూర్ణానుభవములు, కృష్ణపక్షపునాటి వెల్తురు మాత్రమే సంప్రాప్తము లగును. ఇట్టి యనుభవములు విశేష మనఃప్రాణతత్వముల నుండియో లేక సాధారణ మనస్సుకు నతీత మనస్సునకు మధ్య నున్న విశేషభూమికలనుండియో ప్రసరించు నావేశములుగా నున్నవి. ఇట్టి కక్ష్యల నుపలబ్ధిపొందిన వాని కీ యావేశము లుత్సాహపూరితములుగను సంతృప్తికరములుగను నున్నవి. అయితే విజ్ఞానమయ సాక్షాత్కారమింతకంటె బహుకష్టతరమైనది. దాని నియమములు బహు దుర్ఘటములైనవి. భౌతికభూమికలలోని విజ్ఞానమయ చైతన్య మవతరింపజేయుట బహు కష్టతరము. కోరికనుండి సంపూర్ణముగా విముక్తినొందుటకు బహు కాలము పట్టును. ఐతే యిది బాహ్యమునుండి చనుదెంచి నీ ప్రాణభౌతి

కముల గొంతుకలను బిగియఁబట్టుచున్నట్లు నీకు జ్ఞానోదయము గల్గిన ధానిని నీ స్వభావములోనుండి బయటకినెట్టుటకును, దాని దాడులనుండి విముక్తిఁ బడయుటకు సులభసాధ్యమగును. అది నీ స్వభావములో నంతర్భూతమైనదిగనో లేక నీలోఁ బాదుకోఁబడినదిగనో తలపోయు నలవాటు పెచ్చు పెరిగినది. కోరికల చేష్టలతో సులభమగు పోరాటమున కీయలవాటు నీకు ప్రతిబంధకమగుటయే గాక నీ మెడ కనాదిగా దగిలింపఁబడిన సంకెళ్ళను త్రెంపుటకుఁ గూడ నడ్డుఁదగులు చున్నది.

నీ కే దెంత సహాయకారిగాఁ కనఁబడినను నట్టి దాని మీఁద మాత్రమే యాధారపడి యుండఁదగదు. అయితే ప్రధానముగను ముఖ్యముగను మాతృశక్తిమీఁదనే మొనకొని విశ్వసించియుండుము. దేదీప్యమానమైన ప్రకాశములు, జ్యోతిఃకిరణములు సహాయ్యకారులుగా నుండవచ్చును. అవి దబ్బర వెలుఁగులుగాక వాస్తవిక ప్రకాశము లయిన సహాయ్యమిడగల్గును. అయితే మాతృశక్తికి సరితూఁగఁ జాలవు.



సాధకుని యవసరములు సాధ్యమగువరకుఁ గొద్దిగా నుండవలెను. ఎందుకన జీవనాధారములైన యవసరములు నిజములో స్వల్ప

ముగానున్నవి. మిగిలినవి జీవితమున కుపయోగకరములుగనో యలం కారములుగనో వినోదములుగనో యున్నవి. ఈ క్రింద వివరింపఁ బడిన నియమములలో నొకదానికిఁ గట్టుఁబడుటకు నిచ్ఛగించిన యోగ సాధకుఁడీ విలాసవస్తువుల స్వాధీనానుభవముల కర్హతగలిగియున్నాడు.

౧. అనురాగాసక్తముగాని వస్తుసంగ్రహణ సంచయముల శిక్షణ పొందుటకును, వస్తు వినియోగములో భగవదిచ్ఛాను గుణ్యముగా సక్రమనిర్మాణ నిర్వహణ పద్ధతులను దారతమ్యములను నేర్చుకొను టకును సాధకుడు సాధనకాలములో జీవనాధారముల కన్యములైన విశే షవస్తువులు గలిగి యుండవచ్చును.

౨. ఇంతకుమున్నే యనురాగ మమకారములనుండి విముక్తి వడసి ప్రాప్తాప్రాప్తములందు సమహితచిత్తుడైన సాధకుడు సర్వవ స్తువులు గలిగియుండవచ్చును. కోరికలు గలవాడును, ప్రాప్తముగాని దానికి నష్టమైనదానికి శోకించువాడును, నాగ్రహపడువాడును, వ్యాకు లతను బొందువాడును, సమహితచిత్తుడు గాఁజాలఁడు. విషయాస క్తముగాని చిత్తముగలిగియున్నను భగవత్ప్రీత్యర్థ మాతని యుపక రణముగా భాగవత జీవితమున కాయత్తపడుటకు మిక్కిలి నేర్పుతో విషయ సంపత్తిని వినియోగింపనివాడు వస్తుసంపత్తిని గలిగియుం డుటకు నర్హుడు గాజాలడు.

సన్యాసమే పరమావధిగా నీ యోగలక్షణ మెన్నుకొనక పోయినను ఘ్రాణేంద్రియ నిగ్రహమును, ప్రాపంచిక విషయములయందు సక్రమమైన ప్రవర్తనయును నీ యోగములో ముఖ్యాంశములుగా నున్నవి. నియమములేని యాత్మాచరణముకంటె సన్యాస విధానమే శ్రేష్ఠమని నా యుద్దేశ్యము. ఐశ్వర్య సంపన్ను డనగా గుప్పలు గుప్పలుగా నార్జించి కొల్లలు కొల్లలుగా నెగజల్లువాడు గాడు. సక్రమ విధానములో జాగరూకత గలిగి వస్తు సంపత్తు నుపయోగించు నాత్మ నిగ్రహము గలవాడే నిజమైన యైశ్వర్యసంపన్నుడు.

*
* *

నీవు యోగమును సక్రమముగా నభ్యసించవలెనన్న ప్రతివిష యములోను గోరంతలైనను గొండంతలైనను యోగదృష్టిని బెంపొం దించు కొనవలయును. మా పద్ధతిలో గోరికలను బలాత్కారముగా నుక్కడంచు సాధనలేదు. అయితే విషయవాంఛలందు సమతోదా సీనతల దృష్టిని బెంపొందజేయు సాధన గలదు. నిర్బంధ నిరో ధమును, యథేచ్ఛమైన లాలసత్వమును నీ రెండును సమములే. ఈ రెండుపద్ధతులలోను గోరిక నశింపుగాజాలదు. ఒక పద్ధతిలో లాలసత్వమువల్ల గోరిక పోషింపబడుచున్నది. రెండవపద్ధతిలో గోరిక నిర్బంధనిరోధమువల్ల నీలోనణగి శల్యావశిష్టమైయున్నది. నీవు నికృష్టకామమునుండి విడబడి దానికి విలక్షణుడవై సూత్రధారునివగిది

నికృష్టకామోద్భవపు గోరికలను గుసగుసలను నీయాత్మీయములుగావని భావించుచు వానియెడ సమత్వస్థిరతలు గల దృష్టిని నీలో బెంపొంద( జేసికొనుము. అట్టి దృష్టి నీస్వభావములో బెంపొందినయెడల నీ నికృష్టప్రాణముగూడ గ్రమేపి పవిత్రమై శాంతి స్థిరతలగాంచును. కోరికలు తరంగముల పగిది నీమీదికి బైబడివచ్చునపుడు నీకు సంబంధ బాంధవ్యములు లేని బాహ్యవిషయముల నేవిధమున జలింపక యుదాసీనతతో నీక్షించుచుందువో తద్విధముగనే వానిని దిలకించుచు నీ చైతన్యమునుండి పారద్రోలుచుండుము. సత్యదృష్టిగల చైతన్యము ఆ కోరికల స్థానమునందు నెలకొల్పుము.



తిండిపోతు వలె నాహారముమీద మిక్కిలి మమకారము పేరాశ గలిగి యుండ్వెళ్ళారుట, జీవితములో దాని కనవసరమైన ప్రాముఖ్య మొసంగుట యోగాభ్యాసమునకు బ్రతిబంధకములుగా నున్నవి. ఆహారము నోటికింపుగానున్నట్లు దెలిసికొనుటలో దప్పేమియు లేదుగాని యాహారము కొఱకు జిహ్వాచాపల్యము నొంది యుర్విళ్ళూరుటతగదు. దాని ప్రాప్తాప్రాప్తములందు మోదఖేదము లుండదగదు. ఇందులోగూడ సమత్వ స్థిరత్వము లవసరములు. ఆహారము జిహ్వ కింపితముగా లేనప్పుడుగాని, కోరినంత దొరకనప్పుడుగాని తహతహపడుటగాని, ఖేదమందుటగాని తగదు. ఎక్కువలు తక్కువలు లేక యొంత

యవసరమో యంతవఱకే మితముగా భుజింపవలెను. ఉద్వేగపూరితమైన యష్టావిష్టములు గలిగి భుజింపరాదు.

జిహ్వాచాపల్యమునుండి విముక్తిపడుటకు సతతము నీవాహారమును గుఱించి తలపోయుటలో ఫలములేదు. భోజన సమస్య జీవితములో ప్రధానస్థాన మలంకరింపరాదు. దాని నొకమూలనుంచి చింత చేయక పరధ్యానముగలిగియుండుము. భోజనవిషయమై నీమనసును గలతపరచవలదు. శరీరపోషణార్థమై మాతచే ప్రసాదింపబడిన యాహారమును నీలోని భగవదంశమునకు నివేదనజేయుభావముతో మితముగా స్వీకరించినయెడల నది మాంద్యముగలిగింపజాలదు.



షడ్రసోపేతమైన యాహారము పూర్తిగా విసర్జనీయమని యీ యోగము విధించుటలేదు. కాని దానిపై గామోప భోగానురాగములను ద్యజింపవలెను. ఇష్టాన్నము సంప్రాప్తమైనప్పు డానందములో నోల లాడుటగాని యసంప్రాప్తమైనప్పుడు దుఃఖార్ణవములో మునుగుటగాని త్యాజ్యములు. ఇతర విషయములం దెట్లో యాహార విషయమునందు గూడ సమత్వమే గీటురాయి.



నిరశనవ్రతము అపసవ్యమైన యావేశము. స్వల్పాహారము తో గాలము గడుపవచ్చును. ఐతే యేకొద్దికాలమో తప్ప శాశ్వత ముగా నాహారమును సంపూర్తిగా వర్జింపజాలవు. గీతలో జెప్పిన వాక్యములను జ్ఞప్తియందుంచుకొనుము. మితిమీరి భుజించువాడును సం పూర్ణముగా భోజనమును వర్జించినవాడును యోగమున కనర్హుడు. ప్రాణశక్తి యొకవిధమైన తరగతికి జెందినది. ఆహారము లేకయే ప్రాణశక్తి నతిశయముగా ప్రయోగింపవచ్చును. మఱియు నుపవా సముచే దఱుచుగా బ్రాణశక్తిపెంపొందును. అయితే భౌతికతత్వము ప్రత్యేకతరగతికి జెందినది. భౌతికధాతువుయొక్క ఆధారములేనిదే ప్రాణధాతువు మానజాలదు.



స్వభావములో నున్న యాహారేచ్ఛను దృఢీకరించుట గాని పెక్కింతలు చేయుటగాని నిషిద్ధములు. ఆహారేచ్ఛను బెద్దజేయక శుద్ధియొనర్చి వశమొనర్చుకొనుటయే శ్రేయోదాయకమైన పద్ధతి. ఆహా రేచ్ఛను వశపరచుకొనుటకు రెండు పద్ధతులు గలవు. ఆహారము భౌతిక శరీరపోషణార్థమునకు బ్రధాన మనియు, జిహ్వాచాపల్య సంతృప్తి కొఱకు గాదనియు, నుదరసంతృప్తి కొఱకు గాదనియు నెఱింగి యుదాసీనుడుగానుండుట మొదటిపద్ధతి. ఏవేళ కే భోజనము సంప్రా ప్తమగునో, మంచిదిగాని చెడ్డదిగాని, దోషములెంచక మహాప్రసాద

మని స్వీకరించి దానిలో నాహార రసమునుగాక విశ్వానందరసమును గనుగొనుట రెండవపద్ధతి.

భౌతిక శరీరమును నిర్లక్ష్యము జేసి కృశింప జేయుట గొప్ప పొరబాటు. శరీరమూలముననే సాధనచేయ నగును. శరీరారోగ్య పోషణాదు లత్యవసరములు. అట్లని శరీరాభిమానమును బెంచుకొన వలదు. కాని దానియెడ నిరసన నిర్లక్ష్యభావము లుండగూడదు. పరాచేతనోప లబ్ధియేగాక భౌతికముతో గూడిన యావత్తు నికృష్టస్వభావము బరాశక్తి మూలమున బరివర్తనమొనరింపబడుట యీ యోగ లక్షణముగా నున్నది.

భుజించుట కాహారముపైన నపేక్షగాని పేరాశగాని యుండ నవసరములేదు. యోగివరులు శరీరపోషణార్థము భుజింతురు. కోరిక తృప్తికొఱకు భుజింపరు.



మనస్సును రక్తనాడులను బుష్టివంతములై యున్నయెడల లేక నీ దీక్ష బలసంపన్నమై యున్నయెడల నుపవాసవ్రతముచే గలుగు నంతశ్శక్తి సంగ్రహణముల యొక్క యుపలబ్ధులు మనస్సును రంజింపజేయుచు క్షుద్బాధలను నలసత్వములను గర్వరోగములను నివా

రించును. అయితే శరీరము కృశించును. ప్రాణము సొలసి స్మృతి చెడి తబ్బిబ్బులగును. ఎందుకన రక్తనాళగోళములోనికి ప్రవహించు మిక్కుటమగు ప్రాణశక్తిని ప్రాణతత్త్వము భరించి జీర్ణించుకొనలేక సొమ్మసిల్లుచున్నది. గుండె నిబ్బరములేని మనుజు లుపవాస దీక్షను నలుపరాదు. ఈ యుపవాసవ్రతములు వారల దబ్బిబ్బుపరచి మనో వికార భ్రమలకు లో జేయును. ఇదిగాక యాకలిని నిరోధించు కోరికతో జేయు నుపవాసము లపాయకరములుగాఁ బరిణమించును. ఎందుకన నట్టికోరిక కామోద్భవ వ్యాపారమైనందువలన నలవాటుగా బరిణమించి సాధనకు భంగము గలిగించును. మఱియు విషతుల్య మగును. ఒకవేళ యీ దోషముల నన్నిటిని నివారించినను నుప వాసదీక్షలో దగిన ఉపయోగములేదు. ఎందుకన సాధనకొఱకు బరి తపించు నావేదన గల హృదయము, ఏకదీక్షగల మనోదృఢనిశ్చయము విశేషబలమును సంగ్రహణశక్తిని సమకూర్చునుగాని భౌతికసాధనలు చేకూర్పజాలవు.



మన మాకాంక్షచేయు పరివర్తన మొక్క యడుగులో సుల భసాధ్యముగాని యపారమగు చిక్కు విషయము. ఆ పరివర్తన మం తస్తులుగలిగి క్రమక్రమముగా సంభవించును. భౌతిక పరివర్తనము

కట్టకడపట ప్రారంభ మగును. అదియు దినదిన ప్రవర్ధమానమగు మార్పుగా నుండును.

నివృత్తి లేక ప్రవృత్తి భౌతికసాధన లంతఃపరివర్తనల జేకూర్పజాలవు. ఇందుకు మారుగా విజ్ఞానమయచైతన్యమును నీ శరీరము యొక్క ప్రత్యణువులోని కవరోహింపజేసిన నంతఃపరివర్తనముగూడ జేకూరగలదు. అంతవఱకు శరీరమును దాని యాధారభూతములను మామూలు నిద్రాహారములతో బోషింపవలెను. ఆహారము సరియైన దృష్టితోడ భావముతోను భుజింపవలెను. నిద్రను యోగనిద్రగా క్రమక్రమముగా మార్పవలెను. యుక్తతరుణము రాకమునుపే నల్పినట్టి మితిమీరిన భౌతిక వ్రతనిష్ఠలు శరీరేంద్రియశక్తుల దారుమారొనర్చి సాధన కృంతరాయముల నొనర్చును. మఱియు మనఃప్రాణ తత్వములలోనికి గొప్పశక్తి తాండవ మవతరింపజేయును. అట్టి శక్తి తాండవమును భరింపజాలక శరీరము, శరీర రక్తనాళములు సొమ్మసిల్లను; మఱియు బలహీనత జెందును. అందుకొఱకే కఠిన భౌతిక వ్రతనిష్ఠలు సాధనలో ప్రధానాంశములుగా విధింపబడి యుండలేదు. అప్పు దప్పుడొకటి రెండు దినము లుపవాసము లుండుటలోగాని యాహారము తగుమట్టుకు క్లుప్తముచేయుటలోగాని హానియేమియులేదు. అయితే దీర్ఘకాలోపవాసము లుద్యుక్తములుగావు.

*
* *

సురతేచ్ఛ ప్రాణభౌతికములపై దాడి వెడలునప్పుడు సాధకుడు పెడమొగము వహించవలెను. ఎందుకన సురతేచ్ఛను జయింపని యెడల దివ్యచైతన్యానందములు శరీరమునందు నెలకొనజాలవు.

కోరికను నిరోధించిన మాత్రము తోడనే సంపూర్తి కాజాలదు. దానివల్లనే ఫలసిద్ధి సంపూర్తి కాదని నడుమ్పటలో విషయవాంఛలం దోలలాడవచ్చునని పెడయర్థము చేయరాదు. కోరికల నడంచుటయే గాక వానిని స్వభావమునుండి బహిష్కరించవలెనని దానియర్థము. విషయవాంఛల స్థానమందు నేకదీక్ష గల భగవదాకాంక్ష నెలకొల్పుము.

ప్రేమవిషయమేమన నీ ప్రేమ వాహినిని భగవంతునివైపునకే ప్రవహింపజేయుము. మానవు లన్యోన్యకామ సంతృప్తికొఱకు, లేక భౌతికానందముకొఱ కొకరి కొకరిచ్చి పుచ్చుకొను కామవ్యాపారమును ప్రేమయని తలంచుచున్నారు. సాధకులమధ్య నిట్టి కామవ్యాపారము నిషిద్ధ. ఇట్టి కామవ్యాపారాభిలాషగాని, ఇట్టిదానిలో మునిగితేలుటగాని సాధనకు భంగము గలుగజేయును.

ఎవ్వరికిగాని, ఎద్దానికిగాని నిన్ను నీవు సమర్పించుకొనక భగవంతునికి మాత్రమే నివేదించుకొనుటయు, దివ్యమాతృశక్తి సంయోగమువలన బురుషోత్తముని విశ్వాతీతశక్తులను, శాంతిసిస్తేజములను సత్యచైతన్య పవిత్రానందములను నీలోనికవరోహింప జేసికొనుటయు

నీ యోగముయొక్క సర్వసిద్ధాంతముగానున్నది. కనుక నీ యోగములో నితరులతో గామసంబంధబాంధవ్య వ్యాపారములు నిషిద్ధములు. అట్టి సంబంధము లుత్తరక్షణమే నికృష్టచేతనమునకును దుచ్ఛమగు స్వభావమునకును నిన్ను బంధికృతినిగాజేసి భగవత్సంయోగమునకు ప్రతిబంధకమై, విశ్వాతీత సత్యచైతన్యశక్తుల యారోహణావరోహణముల కడ్డుతగులును. ఇట్టి వ్యాపారము మన్మథ శృంగార బాంధవ్య వ్యవహారముగాఁ గాని లేక సురతముగాఁగాని పరిణమించిన మిక్కిలి ప్రమాదకరమగును. అందుకొఱకే సాధనలో నీవిషయములు నిష్కర్షగా నిషేధింపఁబడినవి. బాహ్యశృంగారచేష్టలుగాని యాచేష్టల మనశ్చింతనగాని త్యాజ్యనీయములని వేరుగా జెప్పనవసరములేదు. విశ్వాతీత పురుషోత్తమునితో నైక్యమైనపుడే భగవంతునితో నొకరి కొకరికిగల యాధ్యాత్మికసంబంధ బాంధవ్యముల మనము కనుగొననగును. ఆ పరాకూటములో నీ తుచ్ఛ నీచకామవ్యాపారములకు స్థానములేదు.



సురతేచ్ఛనిగ్రహణ:—రేతస్సును బాహ్యముఖముచేసి యెగజల్లి బూడిదపాలుచేయక మర్మస్థానము నూర్ధ్వమునకు బ్రకోపింపజేయునంతటి శక్తిసామర్థ్యము:

ఆ నిగ్రహశక్తి యిట్టిది. కాబట్టియే బీజములోనున్నబలము నీలోని సర్వశక్తుల భరించగల యాదిభౌతిక శక్తిగ మార్పబడుటకు వీలగును.

రేతస్సు ఓజస్సుగా మారుచున్నది. అయితే సురతేచ్ఛను సూక్ష్మ భావనానందములో మిళితముచేయునట్టి పద్ధతి సాధనయందొక విధాన మనిభావించి యామోదించుట యన్నిటికంటె ప్రమాదకరమైనపద్ధతి. ఇట్టి పద్ధతి యాధ్యాత్మిక పతనములోనికి దల్లక్రిందుగా నిన్ను బడద్రోయును. విజ్ఞానమయ చైతన్యావరోహణమునకు తప్పక ఈసురతేచ్ఛ నీకు అడ్డుతగులును. మఱియు వినాశముల నుత్పాతముల జనింపజేయు కామశక్తుల నార్భటింపజేయును. దివ్య సత్యమును బృథ్వీతత్వములోని కవతరింపజేయవలెనన్న, మఱియు నట్టికార్యముల నిర్వహింపవలెనన్న నిట్టి పెడత్రోవల విసర్జింపవలెను. ఒకవేళ యిట్టి దుర్బుద్ధులు కలిగిన వానినిచైతన్యమునుండి ప్రక్షాళ నము చేయవలెను.

రతిక్రీడ వర్జనీయమనుచు నాంతర్యములో భావనాప్రపంచమందా క్రీడలను జిత్రించి తలపోయుటవలన మర్మగ్రంథులు పరివర్తనము జెందునని యూహించుట గొప్ప పొరబాటు. అజ్ఞానమయమగు భౌతిక సృష్టి యార్థికవిధాన మందొక నిర్దిష్టకార్యముకొఱకే ప్రకృతిలో నైజమై యున్న పశుప్రాంభయగు మైథునకర్మయొక యుక్తిసాధనముగా నున్నది. అయితే యీసురతమును వెంబడించు కామోద్రేకమును, విజ్ఞానమయ మగు తేజోపలబ్ధికి ప్రతిబంధకములయిన కామోద్భవశక్తులను, భూత ముల నుత్పన్నముజేయు వాతావరణమును గలిగించును. సురతము వలన గలుగు నానందము దివ్యానందముయొక్క నిజస్వరూపముగాక

దానిని లుబ్ధపరుచు వికార స్వరూపముగా నున్నది. భౌతికములో నిజమైన దివ్యానందముయొక్క స్వస్వరూపమును, గుణగణములును వేఱుగానున్నవి. ఆ దివ్యానందము స్వయంభువు. అంతరంగమందు భగవంతునితోడి నిత్యసంయోగము గలిగినప్పుడే యా దివ్యానందమును జవి జూడగలవు. నీవు దివ్యప్రేమనుగూర్చి పలికియున్నావు. అయితే దివ్యప్రేమ స్థూలశరీరములోని కవరోహించి నప్పుడిట్టి తుచ్ఛ నికృష్ట కామోద్రేకముల ప్రేరేపించదు. నీ విట్టి కామోద్రేకములకు జనవొసగిన నాదివ్యప్రేమ మొగము విరుచుకొని వచ్చినదారినే యూర్ధ్వ శిఖరముల కుద్గమించును. భౌతికసృష్టిని బరివర్తనముచేయగల యా యొకేయొక దివ్యశక్తిని యూర్ధ్వమునుండితిరిగి యీ మోడువారిన భౌతికములోని కవతరింపజేయుట బహుకష్టతరము. చైత్యపురుషుని ముఖద్వారముననే ప్రవహించుట కిచ్చగించు దివ్యప్రేమను అతని ముఖద్వారమునవే పడయనగును. కనుక నీ నికృష్టకామాపరాధమును వర్జింపుము.

భౌతికసిద్ధికి మర్మస్థానముయొక్క శక్తిపరివర్తన మావశ్యకము, ఎందుకన శరీరములో నున్న మనః ప్రాణ భౌతిక శక్తులకీ రేతస్సే యాధారమైయున్నది. అట్టి యాధారము లేనియెడల ప్రకృతిశక్తులు సన్నగిలును. కనుక నీ రేతశ్శక్తిని విరాజమానమగు ఘనమైన యాత్మజ్యోతిగను నిర్మాణశక్తిగను విశుద్ధ దివ్యానందముగను బరిధానమొనర్చవలెను. ఈ మర్మగ్రంధుల లోనికి విజ్ఞానమయమగు తేజశ్శక్త్యానందముల నవరోహింపజేసిన నవి పరివర్తనము జెందును. ఇట్టి

పరివర్తనానంతరము జరుగవలసిన కార్యక్రమమును, విజ్ఞానమయ మగు సత్యమును సృష్టివంతముల్లైన మాత్ర ఇచ్ఛాశక్తి జ్ఞాన దృష్టు లును నిర్ణయించును, ఐతే సురతేచ్ఛానందములో మునిగిన యాజ్ఞా నానందకార్యకలాపములుగాక స్వస్వరూప మెఱింగిన సత్యనిర్మాణ కార్యకలాపములుగా నుండును. ఇట్టి కార్యకలాపములు విన్ను బోషించి యుద్ధరింపగలవు. మఱియు బూడిదలోని హోమముతీరుగాక స్వార్థ రహితమైన ప్రాణశక్తుల కార్యకలావవ్యాప్తిగానుండును. విజ్ఞానమయ జీవితములో శరీరతుచ్ఛవాంఛల సంతృప్తి యతిశయాతిశయములుగా నుండునని యూహింపవలదు. మానవస్వభావములో నిట్టి పశుత్వమును సన్మానించి గొప్పజేయు నాశయము పతనారోహణకు వైతరణివం టిది. మనస్సు తన గారాబు నభిప్రాయములను బూర్వపరాయణము లైన యూహలను విజ్ఞానమయస్థితి ప్రాప్తించిన సఫలీకృతమగునని వాంఛించును, కామన తనకోరికలు సన్మానింపబడునని తలపోయును. భౌతికము తన సుఖసంతోషముల నభ్యాసముల నెడతెగక యనుభ వించగలనని యాశించును, విజ్ఞానమయసృష్టికలాపమిట్టిదైన యెడల మానవత్వము దివ్యత్వముజెందుటకు బదులుగా వేయింతలు పశుత్వ మునే చెందును.

నీవు ప్రశాంతముగా నున్నప్పుడు నీలోని కవరోహించు దానిని విమర్శించు జ్ఞానమును, నెదుర్కొను శక్తిని వ్యజించవలెననుతలంపు బహుప్రమాదకరమైనది. ఎందుకన నవరోహించునది దివ్యసత్యము

కరుసుచేయుటయుగాక ప్రతిపక్షమైన నెట్టి ప్రమాదము సంభవించునో యూహించుము. సాధకుని వశపరచుకొనుటకు బ్రతిపక్షశక్తులిట్టి వాట మైన లరుణమునకే వేచియుండును. మాతృశక్తికి మఱియు దివ్య సత్యమునకు మాత్రమే నిరాటంకముగా బ్రవేశమియ్యవలెను. ఇక్కడ గూడ నప్రమత్తుడవై మాతృశక్తివలె లేక దివ్యసత్యమువలె ప్రచ్ఛన్న వేషములతో బరకాయించు దబ్బరశక్తుల విమర్శించు జ్ఞానముగలిగి యుట్టివానిని బహిష్కరింపగల శక్తిని గడించి యుండుము.

ఈ యాధ్యాత్మిక విధియందు శ్రద్ధాభక్తులు గలిగియుండుము. ఆహారమునకు దూరముగనుండుము. దివ్యమాతతేజశ్శక్తులకు, నామె నామకత్వమునకు నీచైతన్యసత్త నున్మీలన మొనర్చుము. నీ కేంద్ర సంకల్పము శ్రద్ధాయుక్తమైన. గ్రహింపబడిన ప్రతియొక్క పొరబాటు గాని ఈ యభివృద్ధికి సోపానముగా బరిణమించును.



ఇంతటి యుత్తరములో యోగమునకును, సురతేచ్ఛకునుగల సంబంధమునుగూర్చి నా సిద్ధాంతమును సంగ్రహముగా దెలిపియున్నాను. ఈ సిద్ధాంతము మనోజనితాభిప్రాయము మీదగాని లేక పూర్వ యోగములనైతికభావముమీద గాని నెలకొని యుండలేదు. అయితే నా యనుభవముపైనను. సమీక్షణపైనను. ననుభవము

పైనను నాధారపడియున్నది. ఆంతరికానుభవమునకు బాహ్యచేతనము నకు మధ్య నొకవిధమగు తెరను గల్పించుకొని, బాహ్యచేతనముయొక్క పరివర్తనముపిడనాడి దాని చేష్టలమాత్రమే నీ యదుపాజ్ఞలలోనికి దేగలిగిన, సురతేచ్ఛను సంపూర్ణముగా వర్జింపకయే యాధ్యాత్మికానుభవాభి వృద్ధుల బొందుటకు సాధ్యమగును. ఈ విధానములో మనస్సు బాహ్య ప్రాణములనుండియు భౌతికచేతనమునుండియు పృథబడి తనంతకు దానంత రంగమున మనుగడగలిగియుండును. అయితే ఏకొద్దిమంది సాధకులో దీనిని సాంగోపాంగముగా నాచరింపగలరు. ఏక్షణ మీ యనుభవములు ప్రాణభౌతిక కక్ష్యలకు వ్యాపించునో యప్పుడు సురతేచ్ఛను సీ విధ ముగా దృప్తిపరచుటకు సాధ్యముగాదు. ఈ సురతేచ్ఛ యేక్షణమైనను దబ్బిబ్బులను దలక్రిందులను వికారములు గలుగజేయుశక్తిగా బరిణ మించగలదు. తద్విధముగనే యహంకారమును, రజోగుణసంపన్న ములగు కోరికలును, నాశయములును సాధనలో నాధ్యాత్మికపతనము నకు ముఖ్యకారణములుగా బరిణమించినట్లు నేను గమనించియున్నాను. సురతేచ్ఛను స్వభావమునుండి ధ్వంసమొనర్పక యుదాసీనముతో 'నే నిగ్రహించగల' నను ప్రయత్నము భగ్నమగును. పాశ్చాత్యనవ యుగ గుప్తఋషులు సురతము నుత్కృష్టపరచుటకుగాను జేయుచున్న గడలు మూర్ఖపు పరిశోధనలు. ఏలనన నాధ్యాత్మికమును సురతమును మిశ్రితమొనర్చునపుడు గొప్పయనర్థము సంభవించును. వైష్ణవమధుర భావములీతీరున నీ సురతేచ్ఛను భగవత్పరముచేసి యున్నత మొనర్చ వలెనను ప్రయత్నములోగూడ బ్రమాదమగు హానిగలదు. ఈ యాచార

పరుల నిజస్థితుల గమనించిన దరుచుగా నీప్రమాదమునకు బలియై యున్నారు. భగవత్సాక్షాత్కారమేగాక సంపూర్ణస్వభావపరివర్తన మాకాంక్షించు నీ యోగము రేతశ్శక్తిపైన సంపూర్ణాధికారము తప్పనిసరిగా నావశ్యకమని నేను గల రూపున గనియున్నాను. లేనియెడల ప్రాణచైతన్యము మలినమొంది చిక్కబారును. ఈ మాలిన్యమాధ్యాత్మిక మనశ్శుద్ధిని దూషితముచేయుటయే గాక శరీర శక్తుల యూర్ధ్వగమనమునకు ప్రతిబంధకమగును. సాధారణ నికృష్టచైతన్యము దానికి మూర్ధ్వమునసున్న యాధ్యాత్మిక చైతన్యముతో గలయికకు నుద్గమింపవలెననియు, నీ మనఃప్రాణభౌతికముల బరివర్తనము చేయుటకు పీలోని కాధ్యాత్మికశక్తిని నవరోహింపజేయవలెననియు నీ యోగము బోధించుచున్నది. అట్టి సంపూర్ణావరోహణమార్గమునకు సురతేచ్ఛ యడ్డుదగులుచున్నది. కామనలో నీ సురతేచ్ఛ ప్రబలముగా నున్నంత యది నవరోహణప్రమాదకరముగా నుండును. ఎందుకన నేక్షణమందైనను ధ్వంసముగాక యంతర్హితమైన సురతేచ్ఛ తల నిక్కి చూపి యవరోహించు సత్యమును ద్రోసిపుచ్చి, ఇతర కార్యములకు బొందదగిన బలమును, లేక చైతన్యక్రియాశక్తిని భ్రమకొల్పు మలినమైన విషయవ్యానుభవములకు నుపయోగించును. కనుక నీ దారిలోనుండి దాని యాటంకము తొలిగింపకున్న యోగములో భద్రము కలుగదు. సాధన వ్యవస్థాపనమును నీవు నసర్గళముగా జేరజాలవు.

ఇందుకు వ్యతిరిక్తముగా నీవు సూచించిన యభిప్రాయ మీ క్రింద వివరించిన భావములపై నాధారపడి యుండవచ్చును. "రతివాంఛ మనఃప్రాణస్వభావముల జన్యగుణమనియు, నిద్రాహారములవలె నది యపరిత్యాజ్యమనియు. దానిని నిరోధించుటచే పెక్కు ననర్థములు వాటిల్లుననియు మొదలగు భావములు సక్రమమైనవి కావు." సంభోగ క్రియల కధిగమింప కుండుటయు సురతేచ్ఛ నణగద్రొక్కి యితర విధములుగా దాని క్రీడతో మునిఁగిన యెడలఁ దప్పక శరీర వ్యాధులు మనో రోగములు సంభవించును. ఈ కారణమువల్లనే వైద్య సిద్ధాంతము రతివాంఛ త్యాజ్యము కాదని వాదించుచున్నది. అయితే, యాధ్యాత్మిక విధానముగా నీ రతివాంఛను జయించిన యెడల రోగానర్థములు గలుగ నేరవు. అటుగాక సంభోగ క్రీడకు బదులుగా శృంగార చేష్టలలో లీనమైనఁ గాని, సూక్ష్మ భావనా ప్రపంచమునందు దాని క్రీడలో లీనమైనఁ గాని. యిట్టి యుత్పాతములు సంభవించును. ఇటీవల పాశ్చాత్య వైద్య శాస్త్రజ్ఞులు సురతేచ్ఛ విసర్జన త్రికరణ శుద్ధి యుక్తమైన యెడల శరీరమునకు శ్రేయోదాయకమని సిద్ధాంత మొనర్చి యున్నారు. ఎందుకన రతిక్రీడ కుపయుక్తమైన రేతస్సులోని ధాతువు మఱియొక ధాతువుగాఁ బరిణామ మొంది మనఃప్రాణ భౌతికసత్తల నబోషించును. మన హిందూ ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడిన బ్ర
చర్య వ్రతము నీ సిద్ధాంతమును జక్కఁగా సమర్థించు చున్నది. (
చర్య మనఁగా రేతస్సును నోజస్సుగాఁ బరిణమింప జేయుట, అట్టి

శ్శక్తిని నూర్ధ్వమునకుఁ బ్రకోపింపఁ జేసి దాని నాధ్యాత్మిక శక్తిగాఁ బరివర్తనము చేయుట.

ఈ రతివాంఛను జయించుటకు సంభోగ క్రీడా విసర్జన మాత్రమే చాలదు. బహిష్కరణోదాసీన సాధనలు మేళగించవలెను. ఈ కామనా ప్రేరేపణ నీకుఁ గలిగినప్పుడు దానికిఁ బెడమోము వహించి, యది యాత్మీయము గాదనియు, నీకన్యమైనదనియు, ప్రకృతి శక్తులచే నీపైకి దాటిపల్పు పంపఁబడిన దనియు భావించి, దానితో నేకీభవింపక తిరస్కరింపుము. ఈ విధముగాఁ బహిష్కరించుచున్న రానురాను దూరమై యది బాహ్యమందుండును. అందుచే మనస్సు చలన మొందకుండును. కొంత కాలమునకు నీ రతివాంఛకు మూలాధారమైన ప్రాణసత్తయు దాని పొత్తును మానుకొనును. కట్టకడపటికి భౌతిక చేతనముగూడ దానిని విసర్జించును. నిద్రావస్థలో స్వప్నముల మూలమున నీ రతిభూత మనశ్చేతనము నందుండి ప్రత్యక్షము గాకుండు నంతవఱకును, నీ యుపాంగ్నిని రగులుకొలుపు బాహ్య ప్రకృతి శక్తుల క్రీడ లంతరించు వఱకును, నీ బహిష్కరణోదాసీన సాధన లనుష్ఠించవలెను. రతివాంఛ బలిష్ఠమైనదిగా నుండిన యెడల నీ విధానమే యాచరణీయమైనది. పతే కొందఱికీ సాధనలతో నిమిత్తము లేకయే యీ తుచ్ఛభావము నుండి శీఘ్రముగా విముక్తి కలుగును. అట్టివా రరుదుగా నున్నారు.

సురతేచ్ఛను సంపూర్ణముగా ధ్వంస మొనర్చుట సాధనలోఁ గష్టతరమైన విషయమని చెప్పక తప్పదు. కాలయాపనమునకు విసుగు చెందక దానిపై విజయమును సాధింపవలెను. ఎప్పుడో యరుదుగా నధశ్చేతనము నుండివచ్చు స్వప్నములఁ దప్ప దీనిని బూర్తిగా రూపు మాపినవా రనేకులు గలరు.



సురతేచ్ఛ ఘోరమైనదిగను, పాపభూయిష్ఠమైనదిగను, అయితే యాకర్షణీయమైనదిగను భావింప వలదు. అది నికృష్ట, స్వభావము యొక్క తుచ్ఛపు వృత్తియని భావింపుము. దానితో మెడ పట్టుఁబట్టి పోట్లాడక, దానికిఁ బెడమోము వహించి, దానితో సంబంధము వదలు కొని, యుదాసీనుఁడవై దానికి నీ యామోదము తిరస్కరింపుము. దానిని స్వకీయమైనదిగా భావింపక నీకు బాహ్యమున నున్న ప్రకృతి శక్తి నీనెత్తిమీఁద దానిని బులుముచున్నట్లు భావింపుము. అట్లు పులుమఁ బడుటకు సమ్మతింపక నిరాకరింపుము. నీ కామనలో నే యంశమైన దాని నామోదించిన యెడల నట్టి యామోదము నుపసంహరించుకొమ్మని యా యంశమును నిర్బంధించుము. ఈ బహిష్కరణ సాధనలో నీకు సాహాయ్యమిడుటకు మాత నర్థింపుము. ఈ సాధన నీవు స్తిమితముతోఁ బట్టుదల గలిగి సహనముతోఁ జేయఁగలిగినఁ దుదకు నీ యాంతరిక సంకల్పమే బాహ్య ప్రకృతిపై నెగ్గగలదు.



స్త్రీ పురుష వ్యామోహము నశింపలేదను కారణముచే నీవు జుగుప్స నొంద నవసరము లేదు. యోగపతనమున కిట్టి యూహలు కారణములు గాఁజాలవు. యోగమున కనర్హుఁడవని యిట్టియూహలు సూచింపఁజాలవు. జ్ఞానోదయ మందిన నీ సత్త్వాంశముల నుండి తరుమఁబడిన సురతేచ్ఛ యధశ్చేతనము యొక్క మరుఁగు జొచ్చినది. ఆకాంక్షకును వెలుఁగునకును వికసితముగాని శుద్ధచేతనము లోను, లేని నికృష్ట ప్రాణభౌతికములోను నది తలదాఁచుకొని యుండును. సాధన కాలములో జాగ్రదవస్థలో బహిష్కరింపఁ బడిన విషయములు స్వప్నావస్థలో మాటి మాటికిఁ బ్రత్యక్షమగుట సర్వ సాధారణము. కనుక దిగులొందకుము.

ఇందుకు సదుపాయములు త్రివిధములు. పరాచైతన్యముయొక్క తేజశ్శక్తుల కార్యకలాపముల నీ స్వభావము లోనికిని నంధకారమయమగు వంశము లోనికి నవతరింపఁ జేయుట మొదటి సదుపాయము. స్వప్నావస్థలో జాగ్రదవస్థను బెంపొందించుకొనుచు జాగ్రదవస్థలో నీలో జరుగు పాఠిన నే విధమున నంతరంగమున నెఱుకతో నుందువో తద్విధముగనే నిద్రావస్థలో నీలోన జరగు నటన నెఱుకై యుండుట రెండవ సదుపాయము. నిద్రావస్థలో నున్న శరీరమునకు నీ జాగ్రదవస్థ సంకల్పాకాంక్షలను స్ఫురణకుఁ దెచ్చుట మూఁడవ సదుపాయము. ఈ మూఁడవ పద్ధతి యీ క్రింద వివరించిన రీతిగాఁ జేయనగును. నిద్రించు [illegible] రతిస్వప్నములు గలుగరాదని బలీయమైన భావమును [illegible] సూచనను శరీరమునకు బ్రబోధించుము. మర్మస్థానమున

కెంత ప్రత్యక్షముగను నెంత స్పష్టముగను నెంతకలరూపునను నీ సూచనలను ప్రబోధ చేయఁగలుగుదువో యంతశీఘ్రముగా ఫలము సిద్ధించును. ప్రథమములో ఫల ముత్తర క్షణమేగాని సర్వదాగాని సిద్ధింపదు. అయితే యీ విధమగు సూచన నీవు చేయఁగలిగినఁ దుదకు నెగ్గఁగలవు. స్వప్నమును నాపలేక పోయినను ననర్థము సంభవించకుండు నటుల నకాలములోఁ జైతన్యమును మేల్కొలుపును. సాధనలో మీఁద మీఁదఁ బతనములు గలిగినప్పుడు గూడ జుగుప్స చెందరాదు. నిన్ను నిరోధించుదానికంటె నీవు మొండితనము వహించి పట్టుదలతోఁ బ్రశాంతముగా నుండవలెను.



కామతృష్ణనుండి నీవు ముమ్మాటికి నిచ్చగించిన నది తప్పక కృశింపఁగలదు. ఇందులో నున్న చిక్కేమన నీ స్వభావములోని నికృష్టప్రాణమును నిద్రావస్థలో సంచారము గలిగియున్న యథశ్చేతనమును నవి పూర్వ మభ్యసించిన రతిపాఠములను మఱువక యున్నవి. మఱియు నవి రతిక్రీడలయందాసక్తి గలిగి యున్నవి. నీ వీ భాగములను మాతకు వికసితము చేయుటలేదు. సిద్ధి పొందుటకు మాతృతేజశ్శక్తులను స్వీకరించుమని యీ భాగములఁ బ్రబోధించుట లేదు. ఇట్లు చేయుటకు మాఱుగా సురతేచ్ఛనుండి విముక్తిఁబడయఁ జాలనని యబల చందమునఁ గన్నీరు కార్చుచు దిగులొంది యున్నావు. ఈయలసత్వమునకు స్వస్తి చెప్పుము. ఈ శత్రువును బడమార్చ గలనని భక్తిశ్రద్ధలతోఁ గూడిన ప్రశాంతమైన ప్రతిజ్ఞను జేకొని యీ కామాగ్నికి సమిధ

లైన నీ యామోదమును నది స్వకీయ మను భావమును ద్యజింపుము. అట్లయిన నది యాజ్యములేని దీపము చందమునఁ బూజ్యమగును.



ప్రాణమనస్సులు సమ్మతించి యుత్ఖాత లూగినప్పు డీ మదన తాపము భరింపరాని దగును. నిగ్రహము చెందిన మనస్సుచే సురతేచ్ఛ తూలనాడఁబడినప్పుడు ప్రాణము దానికి స్వాగత మొసంగఁబడిన నది కామోద్రేక పూరితమైన బ్రహ్మాండ వాంఛాతరంగముగాఁ బరిణమించి మనస్సును దాని వెనువెంట నీడ్చుకొనిపోవును. ఉన్నత ప్రాణహృద యముల నుండియు నీ కార్యకలాపముల వర్తించు ప్రాణశక్తినుండియుఁ దానివి దరుమాడిన నది నికృష్ట ప్రాణములోఁ దల దాచుఁకొని యల్పేచ్ఛ గను ప్రేరేపణరూపముగను దల నిక్కఁబెట్టుచుండును. అట్టి నికృష్ట ప్రాణములోనుండి కూడ మెడఁబట్టి నెట్టఁబడినను జర్విత చర్వణమున కలవాటు పడిన జడస్వరూపమగు భౌతికములోనికి దావరించి మర్మేంద్రి యమునకుఁ బ్రబోధ మొనర్చును. మఱియు నట్టి ప్రబోధముల నప్రయ త్నముగా ననువర్తింపఁ జేయును. అక్కడనుండి కూడ బహిష్క రింపఁ బడిన నది శ్చేతనములోనికిఁ జొరఁబడి స్వప్నరూపముగనో లేక స్వప్నములేకయే గలుగు నింద్రియస్ఖలితముగనో యవతరిం చును. అది యే స్థానమున కేగినను లేక యే మఱుఁగు జొచ్చినను నా ప్రదేశములనుండి యింకను గొంతకాలము వఱకు నీ యున్నత శక్తి

లను దిరిగి ముట్టడించి స్వాధీనము చేసికొనుటకుఁ బన్నుగడలఁ బన్ను చుండును. దానిని నీ చుట్టుపట్లనుండి పారఁదోలు నంతవఱకు, లేక నిన్నుఁ బరివేష్టించియుండు నావరణచైతన్యము నుండి బహిష్కరించ నంతవఱకు, అది యంతర్ధాన మొందనేరదు. మనము విశ్వప్రకృతి లోనికి వ్యాపించుటయే యీ యావరణ చైతన్యము.

చైత్యసత్త తన శక్తిని గామన మీఁదికిఁ బ్రయోగించి నప్పుడా కామన యపసవ్యచేష్టలు చైత్యపురుషుని ప్రవృత్తులతో నే మాత్రము మిశ్రము కాకుండునటుల హెచ్చరిక గలిగి జాగరూకుడవై యుండును. ఆ కామన చేష్టలు ప్రేమ వికారరూపములుగా నున్నవి. ఈ వికారరూపములైన కామమోహాంధకారములు నిజమైన ప్రేమ సామ్రాజ్యము నధిష్ఠించుట కడ్డు తగులుచున్నవి. కనుక హృదయములోఁ జైత్యపురుషుని ప్రేమ సంచారము గలిగినప్పుడు కామమోహములకుఁ బ్రవేశ మియ్యరాదు. తద్విధముగనే యూర్ధ్వము నుండి నీకు శక్తి బలములు సంప్రాప్తమైనప్పుడు నీ వ్యక్తిగతాశయము లకు స్వాభిమాన గర్వమునకుఁ జోటియ్యరాదు. స్వాభిమాన గర్వాతి శయములు చైతన్యమును మలినపరచి యాధ్యాత్మిక కార్యకలాపము లకు భంగము గలిగించును.



ప్రాణాయామము ఆసనములు మొదలయిన యితర భౌతికసాధనలు తప్పనిసరిగా సురతేచ్ఛను రూపుమాపఁజాలవు ఒక్కొక్కప్పుడీ సాధనలు శరీరములోఁ గల ప్రాణశక్తుల ద్విగుణీకృత మొనర్చుచు సురతేచ్ఛను గూడ విస్మయ మగునట్లు మిక్కిలి పెంపొందఁజేయును. ఈ సురతవ్యామోహము భౌతిక మూలాధారములో నున్నందువలన దానిని జయించుట బహుకష్టతరము. కనుక గర్తవ్యమేమన నీ కామ చేష్టలకు భిన్నుడవై నీ యంతరాత్మను గనుగొని దానిలోనే మని యుండుము. అప్పుడీ చేష్ట లాత్మీయములైనవి గావనియు, కాని యవి నీ యంతరాత్మపై బాహ్యప్రకృతిచేయు విషప్రయోగములనియు నీకు గోచరించును. అట్టి జ్ఞానోదయము నీకు గలిగిన వానిని సులభముగా బహిష్కరించి తునుమాడ గలవు.

నిద్రావస్థలో నినుగలచు నీ మన్మధుని దాడులకు నీవు భుజించు నాహారముగాని యితరేతర బాహ్య విషయములు గాని కారణము గాజాలవు. ఈ దాడు లథశ్చేతన కృత్యములు, జాగ్రదవస్థలో బహిష్కరింప బడిన యీ పశువాంఛలు, భావములు. స్వప్నరూపములు దాల్చి నిద్రావస్థలో ప్రత్యక్షమగుచుండును. ఎందుకన నిద్రాసమయమం దథశ్చేతనము మాత్రమే పనిచేయు చుండును. అథశ్చేతనము ప్రజ్ఞాహీనమై జంత్రము పగిది పనిచేయుచుండును, జాగ్రదవస్థయందు మనఃప్రాణములనుండి బహిష్కరింప బడిన సురతేచ్ఛ యథశ్చేతనములోనికి చొచ్చుకొనును. కనేక సురతేచ్ఛ భౌతిక స్వభావమునుండి బహిష్క-

రింపబడక జాగ్రదవస్థయందు గల మనఃప్రాణముల యందు నణఁగఁ ద్రొక్కఁ బడినవని యీ స్వప్నములు సూచించుచున్నవి. వీనిని రూపుమాపు వలెనన్న జాగ్రదవస్థయందు మన్మధ శృంగార వ్యాపారపు నూహలను గాని, భావములగాని చెంతఁజేర నీయరాదు. మఱియు నిద్రించుటకుఁ బూర్వము శరీరము పైనను ప్రత్యేకముగా మర్మస్థానము పైనను నేకాగ్రత వహించి యిట్టి స్వప్నములు ఖండితముగాఁ గలుగఁ గూడదని ధ్యానము చేయవలెను. దీని వలనఁ దక్షణమే ఫలము గలుగక పోయినను దీర్ఘకాల మీ పద్ధతిన పట్టు విడువక సాధించినయెడల సామాన్యముగా ఫలసిద్ధి కాఁగలదు. అథశ్చేతనము నీ దృఢ సంకల్పమునకు లొంగ మొదలిడును.



శరీరమును గృశింపఁజేయుట వలన లాభములేదు. దీనిచే సురతేచ్ఛను నీవు జంపజాలవు. సుఖదుఃఖముల ననుభవించునది ప్రాణతత్వము, మఱియు విశేషముగా ప్రాణభౌతికతత్వము.

క్లుప్తాహారముకూడ శాశ్వతమైన జయమును గలిగింపజాలదు. అది భౌతిక పవిత్రతను లేక ప్రాణభౌతిక పవిత్రతను నియ్యఁగలదు మరియు శరీరమును దేలికయొనర్చి తమస్సును గొంతవరకు క్షీణింపజేయును. అయితే క్లుప్తాహారమునకు సర్దుబాటు చేసికొనగల సంభో

గేచ్చ గలదు. కనుక భౌతిక సాధనలతో నీ యుపద్రవముల జయిం పజాలవు. నీ చైతన్యములో మార్పు సమకూడినప్పుడే దీనిని రూపు మాపగలవు.

నీ స్వభావములోని పశుత్వమును విడనాడ కున్నావు. ఎందు కన నీవు నీ యింద్రియ మనోనిగ్రహశక్తుల యాధారముచే నీ స్వభా వమును బరివర్తన చేయుటకు విశ్వయత్నము చేయుచున్నావు. అని ర్దేశ్యమైన నిరాకారభగవచ్ఛక్తి సహకారముమాత్ర మర్థించుచున్నావు. ఇట్టి పన్నుగడలు నిష్ప్రయోజనములు. సజీవముగా నున్నపుడే యీ కళేబరములోనే స్వభావపరివర్తనము చేయగల విధాన మనాదినుం డియు జిక్కుసమస్యగానే యున్నది. ఈ సమస్యను జక్కగా నేదు ర్కొనకపోవుటచేతనే పర్యవసానము తేలకున్నది. ఇతర యోగవిధా నములకీ సమస్య యంత ప్రాముఖ్యముగల్గినదికాదు. ఎందుకన మానవజీవితమును భాగవతజీవితముగా బరివర్తనముచేయుట యాయోగ పద్ధతుల లక్ష్యముగాదు. జీవితమునుండి విముఖత్వమే వాని గమ్య స్థానము. ఇట్టి లక్ష్యోపలబ్ధికి గామనను బంధీకృతము చేయునట్టి మాన క నైతికవిధానములు సరితూగును. కొందరీ నైతికవిధానములగూడ పక పూర్వకర్మానుసారము స్వభావము ప్రవర్తించుచున్నదనియు ర్తన యలంఘనీయమనియు, శరీరనిర్యాణానంతర మాస్వభావ ందుననియు, వాకొనుచు నట్టిప్రవర్తనకు నిర్లిప్తులై వారు సాక్షి లుగానున్నట్లు ప్రవర్తించుచుందురు. ఈ సదుపాయము ఫల

ప్రదాయకముగానియెడల సాధకు డాధ్యాత్మిక భౌతిక ద్వంద్వలోకము లందు సంచారము గలిగియుండును. ఆధ్యాత్మిక లోకానుభవములకు భౌతిక ప్రపంచానుభవములకు హస్తిమశకాంతభేదములుగలిగి ద్వంద్వజీవితముల గడపుచుండును. ఈ పద్ధతులేవియు మనయోగమున కుపకరించవు. కామన చేష్టలపరివర్తన నీ వభిలషించిన, మరియు దాని చేష్టలమీద సంపూర్ణయాజమాన్యము, నీ విచ్ఛగించినట్టిపరివర్తనము యాజమాన్యము నీలోని జీవాత్మయగు చైత్యపురుషుని మేల్కొలిపి యాతని సామ్రాజ్యము నీ యావత్తు సత్తలో ప్రతిష్ఠించినపుడు, భగవచ్ఛక్తికి నాతనిని వికసితముచేసినపుడు మాత్రమే యవి నీకు జేకూరును. ఆతని యవ్యాజప్రేమను నేకదీక్షాభగవదాకాంక్షను భగవద్విషయములందాతనికి గల చలించని యావేశమును నీ మనోహృదయప్రాణములకు బ్రసరింపజేయవలెను. స్వభావ పరివర్తనమునకు నీ మార్గముతప్ప వేరుగత్యంతరములేదు. ఇంతకంటె నెక్కువ సుఖదాయకమైన త్రోవ నిష్ప్రయోజకము. "నాన్యఃపంథా విద్యతే అయనాయ."



# V

## భౌతికచేతన-అధశ్చేతన-నిద్రాస్వప్నములు-జబ్బులు

విజ్ఞానమయ సాక్షాత్కారము మన గమ్యస్థానము. గనుక అందులకే దావశ్యముగా నుపకరించునో, దాని నెల్లను మనము సాధించవలెను. లేక విజ్ఞానమయసాక్షాత్కారమందుండు ప్రతిమజిలీలోని పరిస్థితులకవసరమైన విధానము ననుష్ఠించవలెను. ప్రకృతము భౌతికచేతనమును విజ్ఞానమయమగు మార్పుకు సంసిద్ధముచేయుటావశ్యకము. ఇందుకు వ్యక్తిగతాశాపాశమునుండి విముక్తిబడసిన యాత్మనివేదనము, సంపూర్ణ సమత్వప్రశాంతములను భౌతికములోను నికృష్టప్రాణభాగములలోను నెలకొల్పవలయును. ఇతరవిషయములు సరియైన తరుణమునకు [illegible]. ఇప్పు డావశ్యకమైన దేమన, భౌతికచైతన్యములో జీవాత్మని మేల్కొలిపి, ఆ భౌతికచైతన్యమునందు దానిని సన్నిధానమును నాయకత్వమును నెలకొల్పుట.

* * *

భౌతిక చైతన్యమునుగురించి నీవు వివరించియున్నావు. అది విశేషముగా నధశ్చేతనమునకు సంభవించియున్నది. ఐతే, దానిలో జ్ఞానయుక్తమైన భాగము, యంత్రముపగిది, జడస్వరూపమును దాల్చి పూర్వవాసనలచేతను, నికృష్టప్రాణశక్తులచేతను, నడిపింపబడుచున్నది. సతత మది జ్ఞానహీనమైన చేష్టలను, విచక్షణలేని ప్రవృత్తులను, చర్విత చర్వణముగ కలిగియుండును. పూర్వ పద్ధతులకు, మామూలు దినచర్యలకు, కట్టుబడి ప్రాకులాడుచు, మార్పు చెందుటకు గాని, జ్ఞానము స్వీకరించుటకు గాని, యున్నత శక్తుల ననుసరించుటకు గాని యిచ్ఛగించకుండును. ఒకవేళ యిచ్ఛగించినను, ననువర్తించుటకు శక్తిహీనమై యుండును. ఒకవేళ నట్టిశక్తి కలిగియున్నను, జ్ఞానముచేతను, లేక ఉన్నత శక్తుల చేతను, ప్రసాదింపబడిన నూతన కార్యమును సారహీనమైన మామూలు బాటగ పరిణామ మొనర్చి, ఆ కార్యములోని జీవకళలను నశింపజేయును. ఈ భౌతిక చైతన్య మజ్ఞానముతోను, మూర్ఖత్వముతోను, నలసత్వముతోను, మాంద్యముతోను, నంధకారముతోను, నత్తగుల్ల నడకతోను నిండి నిబిడీకృతమై, తమస్సే ప్రధానముగ కలిగియున్నది. ఇట్టి భౌతిక చైతన్యములోనికే ప్రప్రథమమున నున్నత తేజశ్శక్త్యానందములను, తదుపరి మనయోగ లక్ష్యమైన విజ్ఞానమయ సత్యమును, నవతరింప జేయుటకు, ప్రయత్నించుచున్నాము.



నను, లేక యా విశేషచేతనము యొక్క చదువైన యూర్ధ
కలను నీవు పరిగ్రహించగలవు. ఆ విశేషచేతనకు బునాదియైన
నిశ్చలత, నీరవత, శాంత్యాదుల మొదట పొందగలు
తరువాత నీ వివిధ కక్ష్యలలోనికి, కేవలము నీ శరీరము లో
ఆ నిశ్చల నీరవత శాంత్యాదు లవరోహించును. శక్తి తేజము
రాగలుగును. నాభి, దానికి గ్రిందనుండు చక్రములు ప్రాణ
లకు సంబంధించినవి. పరాశక్తి యంశము క్వచిత్తుగా
ప్రసరించియుండును.

మలంకరించిన యెడల, నీవు నుడివినదంతయు తప్పక సంభవించును. ఇవన్నియు భౌతిక మనస్సుకును, భౌతిక చైతన్యమునకును సంభవించిన లక్షణములు. సత్తలోని యొక యంశమును, పరివర్తనము జేయుటకు, ధ్యేయముగ చేయబడిన నది సత్తలోని మిగిలిన యంశములను నాచ్ఛాదన మొనర్చి, యదియే నీలో నగ్రస్థాన మలంకరించి, నిన్ను సర్వత్ర నావరించుకొనుట సహజము. విడువక మాటిమాటికి తటస్థించుచుండు ధ్యేయమైన స్వభావాంశములోని కష్టములను, అసంతృప్తికరమగు పరిస్థితులను, పరివర్తనముచేయు టావశ్యకము. భౌతిక చైతన్యములో నంతర్హితమైన తమస్సు, అంధకారము, అలసత్వము, అశక్తత, ఉద్గమించుచు, మాటిమాటికి విడువక కమ్ముకొనుచుండును. ఇట్టి యసంతృప్తికరమగు సందర్భములందు, కర్తవ్య మేమన, నీ భౌతిక మాంద్యముకంటె, నెక్కువ మొప్పెతనమును వహించి నిర్దేశించుకొన్న లక్ష్యమునందు పట్టుదల కలిగి—తబ్బిబ్బుపడు కటకలాటగాక, నిలకడ గల పట్టుదల—చట్రాయివలె, నీ కడుపడు, నీ భౌతికములో పరాచైన్యముయొక్క రాకపోకలకు శాశ్వతమైన విశాలమగు ఆధారి నేర్పఱచుము.



పగటికాలమందు సాధనలో ప్రతి మనుజునికి చైతన్యములో తారుమార్లు సహజముగ కలుగుచుండును. భౌతిక చైతన్యములో సాధన సలుపుచున్నపుడు, వెనుకముందులకు తడుమాడుట, ఉపలబ్ధిని బొందక

అనుభవమునకు మాత్రమే వచ్చిన యున్నతభావము నుండి మామూలు భావములోనికి క్రుంగుట మొదలగునవి బలీయముగ నుండును. ఎందు కన. నున్నతతర విశేష చైతన్యము నీకు తీవ్రతను, బలమును, భౌతిక స్వభావములోని మాంద్యము నెడతెగక భరించజాలదు. భౌతికము సర్వదా తన మామూలు స్వభావమునకును, చేష్టలకును క్రుంగుచుండును. ఉన్నత విశేష చైతన్యమును, మఱియు దాని శక్తియును, దీర్ఘకాలము కృషి సల్పుచు మఱిమఱి యవతరించిన గాని, భౌతిక చైతన్యము శాశ్వతముగ మారి పరాచైతన్యమును బొందజాలదు. ఈ తారుమారు లెంత చీదరింపుగనున్నను, కాలవిలంబన మెంత దీర్ఘమైనను, తబ్బిబ్బు పడవలదు. జుగుప్స చెందవలదు. లోన ప్రశాంతము వహించి అచం చలుడవై యుండుము. ఉన్నత శక్తికి సాధ్యమగువరకు నుస్మీలుడవై యుండుము. ప్రతికూల పరిస్థితులు నిన్ను పైకొనకుండ హెచ్చరిక గలిగి యుండుము, ప్రతికూల శక్తులదాడు లంతరించిన, లోటుపాట్లు మాత్రమే మిగిలియుండును. ఈ లోటుపాట్లను పెక్కింత లందరును గలిగియున్నారు. పరాశక్తి కృషిసల్పి వీనిని నాశనము చేయవలెను. అయితే, యివి నాశనము కాబడుటకు సావకాశము పట్టును.



నికృష్ట కామస్వభావ చేష్టలు, విడువక మాటిమాటికి తటస్థించు చున్నవని ధైర్యమును కోల్పోకుము. జడస్వరూపమైన చైతన్యము

యొక్క సంపూర్ణ పరివర్తనమువల్ల, భౌతిక స్వభావము ఆద్యంతము మారువరకు నికృష్టచేష్టలలో కొన్ని విడువక పలుమారు తటస్థించు చుండును. లేక, అప్పుడప్పు డవి రాకపోకలు కలిగియుండును. అంత వరకు వాని యొత్తిడి అప్పుడప్పుడు సంభవించుచుండును — కొన్ని వేళలందు ద్విగుణీకృతమైన యొత్తిడి కలిగియుండును. కొన్ని వేళ లందు, ఆ యొత్తిడి, అల్పస్వల్పముగ నుండును. యంత్రము పగిది అలవాటు రూపము దాల్చును. ఈ యలవాట్లకు నీ మనఃప్రాణము లామోదించక నిరాకరించిన, నవి జీవచ్ఛవములగును. అప్పుడీ యంత్ర సమానమగు నలవాట్లు నీ మనఃప్రాణములను చలింపజేయక తుట్టతుదకు విరమించును.



శుద్ధభౌతికచైతన్యము, మూలాధారచక్రమందు, కేంద్రీకరింప బడియున్నది. మూలాధారచక్రమున కడుగుభాగముననున్న మిగిలిన శరీరమంతయు శుద్ధభౌతికములో చేరియున్నది. అధోముఖమునకు పోను పోను, నీ శుద్ధభౌతిక మథశ్చేతనముగ మారుచున్నది. అయితే చైతన్యముయొక్క నిజమైనయునికి, ఏవిధమున శరీరోర్ధ్వభా మున్నదో, తద్విధముగనే, అథశ్చేతనముయొక్క యునికి, శరీరా మున నున్నది. అథశ్చేతన మిట్లు శరీరమున కధోభాగమున నున్న సర్వత్ర దానిని కనుగొననగును. నీ చైతన్యప్రవర్తనకు, న

భూతముగనో, లేక నీ చైతన్యమును తనవంకకు నాకర్షించు శక్తిగనో దాని నెల్లదిశలందును, కనుగొనగలవు. అన్ని యలవాట్లకు నందులో ముఖ్యముగ భౌతికప్రవర్తనకు, మరియు నికృష్టప్రాణిచర్యలకు నీ అథశ్చేతనమే మూలాధారమైయున్నది. నీయొక్క భౌతికమునుండియు లేక నీ కామననుండియు తరమబడిన ప్రతివిషయ మథశ్చేతనము యొక్క మఱుగుజొచ్చి, అచ్చట భూమిలో పాతిన విత్తనము చందమున మనుగడకల్గి, వీలైనప్పుడెల్ల పైకినెగబ్రాకి తలచూపుచుండును. అందువల్లనే, నీ పూర్వాభ్యాసములుకాని, ప్రవర్తనగాని, పరివర్తన మగుటకు కష్టతరముగ నున్నది. అథశ్చేతనమను గర్భగోళమందు భద్రముగ పోషింపబడుచున్న నీయొక్క కామనప్రవృత్తులను, నీవెంత అణగద్రొక్కినను, లేక ఖండించినను, నవి నశించక మరియు మోసులెత్తుచు నిన్ను పైకొనుచున్నవి. అథశ్చేతనము మహామూర్ఖ మైనది, అది యంత్రముపగిది చర్వితచర్వణమైన ప్రవృత్తులను కలిగి యుండును. నీ మనస్సంకల్పములకు జ్ఞానప్రబోధములకు, నదిపెడ చెవిపెట్టును, పరాచైతన్యతేజశ్శక్తులను దానిలోనికి నవతరింప జేసి నప్పుడే యది మారగలదు.



ప్రకృతిలో నున్న ఇతరతత్వము లెట్లో యథశ్చేతనముకూడ విశ్వగతముగాను, వ్యక్తిగతముగాను ఉన్నది. అయితే, అథశ్చేతన

మందు పలువిధములైన భూమికలున్నవి. పృధ్వీమీదనున్న స్థావర జంగమములన్నియు, సాధారణముగ పేర్కొనబడు నచేతనముమీద నాధారపడియున్నవి. కాని అది వాస్తవములో నచేతనముకాదు. అది అణగియున్న అథోముఖమగు చైతన్యము. సర్వము దానిలో నంతర్భూతమై యున్నది. అయితే, యేదికూడ దానిలో రూప నామములు కలిగియుండలేదు. అచేతనమునకును, జ్ఞానోదయము పొందిన మనఃప్రాణభౌతిక చేతనములకును మధ్య అథశ్చేతనమున్నది. గ్రుడ్డు లోని గుజ్జునందు, జీవోత్పన్నమగు శక్తి సుస్థిరతమైన చంద మున, ప్రాణవాయువుల సంచారమునకు నంధకారములో తెలిసీతెలి యక, ప్రతిపల్కు శక్తి యథశ్చేతనములో నంతర్హితమైయున్నది. భౌతికములో మెలిగొనియున్న యణువుల మాంద్యమునుండియు, జడ త్వమునుండియు విముక్తిబడయుట కీ అథశ్చేతనములో నున్నశక్తి చలపోరుచున్నది. సతతాభివృద్ధిచే మందగమనమైన, పరిణామముగల్గి జీవాత్మ నిర్మాణచైతన్యముగా, నీ యథశ్చేతనశక్తి పరిణమించుచున్నది. ఈ విషయములు భావాకృతిదాల్చిన సంకల్పావేగములుగగాని, లేక, జ్ఞానయుక్తమైన ప్రతిక్రియలుగాగాని, యథశ్చేతనమందులేవు. అయితే, అవి భావాకృతిదాల్చని ద్రవరూపముగా, నథశ్చేతనములో నిమిడి యున్నవి. ఇదియునుగాక, జాగ్రదవస్థలో ననుభవించిన, యన్ని విష యము లధోముఖమైయున్న యథశ్చేతనములోనికి క్రుంగుచున్నవి. అయితే, యీ యనుభవములు, సంపూర్ణాకృతిదాల్చిన చిత్తరూపముగా గాని లేక స్ఫురణరూపముగాగాని గాక, అస్పష్టమైన వాసనారూప

ములదాల్చి, అథశ్చేతనమందు జొచ్చుచున్నవి. ఈ యనుభవవాసన లేనిమిషమందైనను, స్వప్నరూపములుగను, అప్రయత్నముగ చర్విత చర్వణమై సంభవించు సంకల్పావేగములుగను, ప్రవృత్తులుగను. తలవనితలంపుగ, కార్యకలాపములుగను, సంఘటనములుగను. పరిణమించు శోభలుగను, సంభవించుచుండును. అన్ని విషయముల చర్విత చర్వణమునకును, ఈ చర్విత చర్వణ విషయములందు, రూపములో తప్ప మూలాంశములో మారనందుకును, అథశ్చేతనమే మూలకారణమైయున్నది. మనుజుని ప్రవర్తన, లేక స్వభావము మార్పుబడజాలదను లోకోక్తికిదియే హేతువు. శాశ్వతముగ విషయవాసనలుండి, విముక్తిజెందితినను నమ్మికగలవానికి గూడ తిరిగి యీ విషయవాంఛలు సంభవించుటకిదియే కారణము. అన్నిబీజములును, ప్రారబ్ధసంచితములైన మనః ప్రాణ భౌతిక విషయ వాసనలును (సంస్కారములు) అథశ్చేతనమందంతర్హితమైయున్నవి. మృత్యువునకును, వ్యాధులకును ఇదియే ముఖ్యాధారముగనున్నది. ఇదియే అజ్ఞానముయొక్క కట్టకడపటి కోటబురుజుగానున్న శరణాలయము. (చూపునకు మాత్రమే అభేద్యముగనున్నది.) స్వభావమునుండి బహిష్కరింపబడక దానిలో నణగద్రొక్కబడినదంతయు నథశ్చేతనములోకి క్రుంగి, బీజరూపములుదాల్చి యేక్షణమందైనను మోసులెత్తుటకు సిద్ధముగనుండును.

* * *

మనలోని అథశ్చేతనము, పరిణామమున కాధారభూతముగ నున్నది. మనలో నంతర్హితమైన సర్వస్వభావమునకును, లేక మన ప్రకన్నతవుస్వరూపము యొక్క పుట్టుకకంతకును అథశ్చేతనమే మూల కారణము కాదు. అయితే, అథశ్చేతనమునుండి విషయములుద్గమించి మన చైతన్యభాగములందు రూపములు దాల్చగలవు. మరియు, మన లోని ప్రాణభౌతికాల్పస్వాభావిక గుణములకు, ప్రవృత్తులకు, అల వాట్లకు, ప్రవర్తనకు, నిదియే జన్మస్థానము.

మన ప్రవర్తనకు త్రివిధములైన గుప్తములగు నుత్పత్తిస్థానములుగలవు—పరాచేతనము, అంతశ్చేతనము, అథశ్చేతనము—వీనిలో నేదికూడ మన ఆధీనమందులేదు, తుదకు వాని ఎఱుకకూడ మనకు లేదు. బాహ్యసత్తను మాత్రమే మన మెఱుక కలిగియున్నాము. ఈ బాహ్యసత్త యొక పనిముట్టుగ నేర్పరుపబడియున్నది. వీనికన్నిటికి, విశ్వచైతన్యము మూలస్థానముగ నున్నది. విశ్వప్రకృతి, ప్రతి వ్యక్తిలో, సృష్టికరించుచున్నది. ఎందుకన, నీ విశ్వప్రకృతి మనలో కొన్ని అలవాటుప్రవృత్తులను, ప్రవర్తనలను, శక్తులను, అభిరుచులను, మూర్తితత్వమును, నెలకొల్పుచున్నది. జన్మకు పూర్వముగగాని, లేక పిమ్మటగాని, మనలో రూపమొందిన యట్టి విషయములనే 'మేము', 'మే' మని, పేర్కొనుచున్నాము. ఈ లక్షణములే, చాలమట్టుకు మన బాహ్యజీవితములో, చర్విత చర్వణముగ, సంచారముగల్గి యుపయోగ పడుచున్నవి. ఈ లక్షణములు, విశేషముగ మన బాహ్య

చైతన్యమునకు నధోభాగముననో, లేక వెనుకభాగముననో యున్న గోప్యమగు త్రివిధచైతన్యములలో దాగి యున్నవి. విశ్వప్రకృతి తరంగములు, నపరోక్షముగనో లేక పరోక్షముగనో, ఇతరులమూలముననో, పరిస్థితులమూలముననో, నానావిధములైన కారకుల మూల ముననో, రాకపోకలమూలముననో, మనబాహ్యచైతన్యము ననుసంధించి క్రియోన్ముఖమొనర్చుచు, మార్చుచు, నభివృద్ధిచేయుచునున్నవి. ఈ విశ్వ ప్రకృతిలోని కొంతభాగము, మనజ్ఞానయుక్తమైన యంశములలోనికి ప్రవహించి ప్రవర్తించుచున్నవి. అయితే, మన మనస్సు ఈ ప్రవర్తన కాది భూతమును కనుగొనలేక, అది స్వకీయమని భావించుచున్నది. కొంత భాగ మథశ్చేతనములోకి ప్రవహించి అందులోనే మునిగియుండి, ప్రజ్ఞాయుక్తమైన బాహ్యచైతన్యములోనికి నుద్గమించుటకు తరుణముల కొరకు వేచియున్నది. విశేషభాగము, అంతశ్చేతనములోకి ప్రవహించు చున్నది. అది యేక్షణమందైనను, బహిర్గతము కావచ్చును, లేక కాకపోవచ్చును. ఉపయోగింపబడని విషయసముదాయము లక్కడనే మనియుండవచ్చును. కొంతభాగము బహిష్కరింపబడియు, నిరపించ బడియు. విచ్ఛిన్నంబుకాబడియు, విశ్వసముద్రములోకి త్రోయబడుచున్నది మనకు ప్రసాదింపబడిన శక్తుల, సతతకార్యకలాపమే మన స్వభావ ముగ యేర్పడుచున్నది. ఈ శక్తులలో, నేదో కొంతభాగమే మన ముప యోగించుట కిచ్చును, లేక శక్తిని కలిగియున్నాము. మన మిట్లుపయో గించుకొని, నిర్మించుకొన్న రూపము మార్పులేని నిర్దిష్టమైన రూపముగ కనబడుచున్నది. అయితే వాస్తవములో, నదియంతయు శక్తుల క్రీడగా

నున్నది. మఱియు, నదీప్రవాహములోని జలము చందమున, నేదియు స్థిరముగా గాని, నిర్దిష్టముగాగాని లేదు. ఒకే విధమైన ప్రవృత్తులు, ఆవేశములు, చర్వితచర్వణముగ, పలుమారు సంభవించుచున్నందున, స్థిరమైన ప్రవర్తనయున్నట్లు మన మూహించుచున్నాము. కనుక నీ కారణమువల్ల, మన స్వభావమును మార్చుకొనుటకు సాధ్యమగును. స్వభావము మారజాలదని నుడివిన 'వివేకానందుల వాక్యమును', 'మోరెస్‌గారి సామెతయును' వేదవాక్యములు కాజాలవు. స్వభావము యొక్క మార్పుకు, నథశ్చేతన మెంత పినకపట్టుపట్టి అధిక్షేపించినను నట్టి అధిక్షేపణము, కలకాలము మనజాలదు. అయితే యీ అధిక్షేపణకు, భిన్నముగా స్వభావమును మార్చుట, యెదురీతచందమున మహాకష్టతరము. ఎందుకన, ప్రకృతిలో చర్వితచర్వణము మూలసూత్రముగ నున్నది.

నీ స్వభావములోనుండి బహిష్కరింపబడిన విషయములు, తిరిగి విన్నా వేశింపకుండుటకు, నీవు వానిని మిక్కిలి దూరమగు దిశకు పార దోలవలెను, ఇట్లు బహిష్కరించి, పారదోలుటలో నీవు తరుచుగ, నొక విధానమును బాటించవలెను. మనస్సు దాని మనో అంశముల బహిష్కరించును. ప్రాణము, దాని కామనాంశములను బహిష్కరిం చును. భౌతికము, దాని భౌతికాంశములను బహిష్కరించును. ఇట్లు బహిష్కరింపబడిన మనఃప్రాణభౌతికాంశములు, విశ్వప్రకృతిలో, వాని వాని మూలతత్వములను జేరుచున్నవి. ఇవి, ప్రప్రథమమున మనలను పరివేష్టించియున్న యావరణ చైతన్యములోనికి, విశ్రమించుచున్నవి.

పొగచే నావరింపబడిన, వంటయిల్లు చందమున, మన మీ యావరణ చైతన్యముచే నాచ్ఛాదింపబడియున్నాము. ఇట్లాచ్ఛాదన మొనర్చు చైతన్యముఖద్వారమున, మనము బాహ్యప్రకృతితో, సకలవ్యాపారములు కలిగియున్నాము. బాహ్యప్రకృతితో మన మనుసంధించినపు డీ యావరణచైతన్యములో, తలదాచుకొని బహిష్కరింపబడిన విషయములు నీ మీదికి మాటిమాటికి లంఘించును.—ఇవి నిశ్శేషముగ బహిష్కరింపబడనంతవరకు, లేక ఇవి మరలివచ్చుటకు వీలు గానంత దవ్వుకు తరుమబడునంతవరకు, నీమీదికి పైకొనుచుండును.—జ్ఞానయుక్తమైన మనస్సు ఏవగించి, వానిని బహిష్కరించినపుడు, ప్రాణమట్టివాని కాధారమొసంగిన నవి కామనలోకి దుమికి అచ్చటి నుండి చెలరేగి, తిరిగి మనస్సును వశపరుచుకొనుటకు, శరవేగముతో పరుగిడును. మహాప్రాణముకూడ—హృదయము, లేక విశేషప్రాణశక్తి—వానివి నిరాదరణచేసినయెడల, నవి నికృష్టప్రాణము మరుగు జొచ్చును. ఆ ప్రదేశమునుండి, అల్పప్రేరేపణమూలమున, మన నిత్యజీవితములో, నవి తుచ్ఛాంశములుగ పరిణమించుచున్నవి. నికృష్టప్రాణముకూడ, వానిని బహిష్కరించిన, నవి భౌతికచైతన్యములో దొందుకొని మాంద్యరూపముగనో, లేక అప్రయత్నమైన చర్వితచర్వణముగనో, నీ స్వభావమును నంటుకొనియుండును. ఆ ప్రదేశము నుండికూడ తరుమబడిన యెడల అవి యథశ్చేతనములోనికి జొచ్చి తమఃప్రధానమైన నిద్రలో స్వప్నములుగ నవతరించును. అజ్ఞానము నకు కట్టకడపటి శరణాలయము అసత్తు లేక అచేతనము.

విశ్వప్రకృతిలోనున్న నికృష్టశక్తులచర్యలు, వ్యక్తిగత స్వభావములో, నిరంతర ముండులాగున ప్రయత్నించుచున్నవి. మఱియు నీ స్వభావములో నికృష్టశక్తులు నిలువయుంచిన విషయములను, నీవు శిధిలమొనర్పగా అవి పునః నిర్మించుకొనుచున్నవి. అవి తమ సంపర్కమును నీవు నిరసించుచున్నట్లు గుర్తెరింగిన ద్విగుణీకృతమగు శక్తితోను, ఉద్దండమైన శరవేగముతోను, నీపైకి దండెత్తుచున్నవి, పరివేష్టించియున్న యావరణ చైతన్యమును శుద్ధి యొనర్చిన నివి చాలకాలము మనజాలవు. ప్రతిపక్షశక్తులు చేయూత నొసంగినయెడల నివి అప్పటికికూడ దాడిసల్పగలవు. అయితే సాధకుడు తన యంతస్సత్తయందు పాదేర్పరుచుకొని మొనకొని యున్న యెడల నవి దాడిమాత్రము సల్పి విశ్రమించును.

పూర్వజన్మసంచితములైన యభినివేశములతోను, నభిరుచు తోను, నీజన్మకవతరించియట్టివాని కనుసరణీయముగ, మనము విశ ప్రకృతిని ననుసంధించుచున్నామనునది వాస్తవము. వంశపరంపర వచ్చిన లక్షణములు, బాహ్యసత్తను మాత్రమే బాధించును. ఈ ల ణముల నన్నిటినిగూడ, బాహ్యసత్త అంగీకరించదు. ఈ జ నిర్దేశింపబడిన రూపముల కనుగుణమైన లేక ప్రతిబంధక లక్షణముల మాత్రమే యది యంగీకరించును.

* * *

అలవాట్లతోను చిత్తస్ఫురణలతోను అధశ్చేతనము నిండి యున్నది. అది చర్వితచర్వణముగ తప్పక మాటిమాటికి పూర్వము నీచే అంగీకరింపబడిన విషయములను జన్యగుణములను, నీ మనః ప్రాణముల యిష్టానిష్టములను, ప్రతిబింబింపజేయుచుండును. నీసత్తలో విశేషజ్ఞానోపలబ్ధిపొందిన భాగము అధశ్చేతనముకంటె, మొండిపట్టు దిలగలిగి, అదిదాని పూర్వాచరణలకు స్వస్తిచెప్పి నూతన సత్యమార్గముల నభ్యసించునటుల నిర్బంధించవలెను.



అధశ్చేతన భౌతికములో సర్వసాధారణముగ నీ వెంత మనగిన కలిగియున్నవియు నీవు గుర్తెరుగవు. ఈ యధశ్చేతనములోనే నీ మనఃప్రాణముల యభ్యాసవృత్తులు నిలుపరముగ నున్నవి. నీ మనస్సు జాగ్రదవస్థలో నున్నపుడు అవి యధశ్చేతనమునుండి నీ పైకి తరలి వచ్చును. ఊర్ధ్వచైతన్యము నుండి తరుమబడిన యీ ప్రవృత్తులు రాక్షస గుహయగు నీ అధశ్చేతనములోనికి జొచ్చును. జాగ్రదవస్థ యందు ప్రవేశించుటకు వీని కవకాశము నిరాకరించిన నవి నిద్రాసమయములందు స్వప్నరూపములుగ ప్రత్యక్షమగును. అధశ్చేతనమునుండి, వానిని సంపూర్తిగ ప్రక్షాళన మొనర్చినప్పుడును, మరియు నధశ్చేతనమందలి గుప్తకక్ష్యలలోనికి తేజ మవరోహింపజేసి వాని నారులేకుండ నాశన మొనర్చినప్పుడును అవి శాశ్వతముగ మాయము కాగలవు. నీ

చైతన్య మంతర్ముఖమగు కొలది. నికృష్టాథోభాగ చైతన్యకక్ష్యలలోనికి పరాజ్యోతి యవతరించుకొలదిని నీ నికృష్టస్వభావ మంత మొందగలదు.



అథోభాగముననున్న శక్తులను ప్రజ్వలింప జేయుటకు, సాధ్యము కలదు. ఇట్టి ప్రయత్నములో నథోభాగమున గుప్తమై యున్న దివ్య శక్తి లుద్గమించి యూర్ధ్వముఖము కలిగి ఊర్ధ్వమునుండి క్రింది కవ తరించు దివ్యశక్తుల యాగమనముతో వానికి సంయోగము కలిగిన శరీ రము పరాచైతన్యముచే నింపబడుటకు వీలగును. ఒకవేళ నీ ప్రయత్న ములో నథోభాగమున నున్న నికృష్టశక్తులు ప్రకోపించిన యెడల తమ స్సును, లేక గందరగోళమును కలుగజేయును. ఒకొక్కప్పుడు. అతి శాతిశయ మాంద్యమును, నప్రమేయమైన దారుమార్గము కలుగజేయును.

నికృష్ట ప్రాణకక్ష్య మహాంధకారముతో కూడుకొని యున్నది. దాని కూర్ధ్వమున నున్న కక్ష్యలు జ్ఞానతేజములకు వికసితమైన తదుపరి. ఆ నికృష్ట ప్రాణకక్ష్యను నుస్మీలన మొనర్చిన బాధకరముగ నుండును. ఊర్ధ్వకక్ష్యల జ్ఞానోపలబ్ధి పొందనివారు నికృష్ట ప్రాణకక్ష్యలో నేకాగ్రత నల్పిన గందరగోళముల పాలగుదురు. ఈ కక్ష్యానుభవములు, ప్రాణంథ ములో కాని, లేక యూర్ధ్వకక్ష్యల అనుభవములకు పూర్వము గాని

కలుగవని యభిప్రాయపడవద్దు. వానంత నవి కలుగును. అయితే నీవు వానికి ప్రముఖత్వ మొసంగకూడదు.



సూక్ష్మశరీరములో (అంతర్గత శరీరములో) యోగశక్తి సర్పము చుట్టచుట్టుకొని పరుండిన విధంబున నిద్రావస్థలో మునిగి మాంద్యమే వహించియున్నది. నీవు యోగముచేసి నప్పు డీ యోగశక్తి తనంతట తాను తనచుట్టను ఓడిపించుకొని, మన యుపరిభాగమున ఊర్ధ్వమునందు వేచియున్న దివ్యచైతన్య శక్తులతో సంయోగము పొందుట కుద్యమించు చున్నది. ఇట్లు నిద్రనుండి మేల్కొనిన యోగశక్తి ప్రకోపించినపుడు, చుట్టచుట్టుకొని పరుండియున్న నాగసర్పము చక్కగ తోకమీద పైకినిలవ బడి లేచు విధంబున, నది యూర్ధ్వమున కెగబ్రాకుచున్న దను భావన నీకు కల్గును. ఊర్ధ్వముననున్న దివ్య చైతన్యమును ననుసంధించి నపుడు ఆ దివ్య చైతన్యము నీ శరీరములోనికి సులభముగ నవరోహించుచున్నట్లును, అట్లవరోహించు దివ్య చైతన్యము నీ స్వభావమును పరివర్తనము చేయుచున్నట్లును నీవు భావించగలవు.

నీ శరీరమును మరియు నేత్రములును, నూర్ధ్వమునకు ప్రకోపించుచున్నట్లు నీకు కలిగిన యుపలంభన మీ యోగశక్తి సంచారము వల్ల సంభవించినది. నీ శరీరములోని, యంతర్చైతన్యమును, నీ శరీ

కములోని యంతర్ సూక్ష్మదృష్టిని, పరమందున్న దివ్యచైతన్యమును, శ్యదృష్టిని, ననుసంధించుట కూర్ధ్వమునకు నెగబ్రాకుచున్నవి.



అధోభాగముననున్న, నికృష్టస్వభావకక్ష్యలలోనికి, నీవు ప్రవేశించి నపుడు, జ్ఞానోదయ మొందిన చైతన్యకక్షల సంపర్కమును జాగరూకత కలిగి, వాని మూలమున నీ యంధకార మయమగు దిగువ కక్ష్యల లోనికి తేజమును, పవిత్రతను తేవలయును. ఇట్టి జాగ్రత్త లేనివాడు నికృష్టకక్ష్యప్రవృత్తులలో లీనమైపోవును. అంధకారములోను, చిక్కులలోను, మునిగిపోగలడు.

చైతన్యవిశేష భూమికలయందు మనియుండుట భద్రమైనమార్గము, ఆ ప్రదేశములనుండి నికృష్ట స్వభావమును, పరివర్తనముకొరకు నిర్బంధింపుము. అట్టిది చేయగలుగు నేర్పును, నభ్యాసమును నీవు బొందవలెను. ఇట్టి శక్తి నీ కలవడిన ఆ శక్తి నీ యభివృద్ధిని సులభోపాయముగను, సుఖప్రదాయముగను చేయగల్గును.



నీ వభ్యసించు చైతన్యతత్వవిభజన శాస్త్రము సక్రమమైనదికాదు. ఇట్టి యభ్యాసము శుద్ధి సంస్కారమును సులభోపాయము చేయక,

చిక్కు పరిస్థితులలో ముంచుచున్నది. "ఫ్రూడ్" దొరగారి చైతన్యతత్వ విభజన, యోగాభ్యాసుల కేమాత్రము సమంజసమైనదికాదు. అజ్ఞానము తోను, ప్రమాదముతోను కూడుకొనిన అథశ్చేతనములోని నికృష్ట ప్రాణ కక్ష్యను "ఫ్రూడ్" దొరగారు ప్రధానముగా దీసికొని, దానిలోని నప్రమే యమైన రోగాంశములను ప్రత్యేకించి, యట్టి యంశములకును, నికృష్ట ప్రాణతత్వమునకును, నీ స్వభావములో వానికిగల నిజమైన కర్తృత్వాధి కారమును నూరింతలు జేసియున్నాడు. ఆధునికాత్మ తత్వపరిశోధన శాస్త్రము బాల్యావస్థలో నున్నది. మరియు నపరిపక్వ స్థితిలో తడుమా డుచు, వొడుదుడు కభిప్రాయములకు లంఘించుచున్నది. పాక్షికసత్య మును సమగ్రమైన సత్యసిద్ధాంతముగ జేసి, యట్టి సంకుచిత సిద్ధాంత ముచే, సర్వ జగత్తును నిర్వచనముచేయు మనస్సునకు గల సర్వసాధారణ మైన యలవాటు, బాల్యావస్థలో జోగాడుచున్న సకలశాస్త్రములలో ప్రబలియున్నట్లు, ఆధునికాత్మ తత్వపరిశోధనలోకూడ ప్రబలియున్నది. ఇదియును గాక అణగద్రొక్కబడిన సురతేచ్ఛాభావముల కియ్యబడిన ప్రముఖత్వము మనఃప్రాణముల నెక్కువ మలినపరుచును గాని శుద్ధి బరచజాలదు.

మానవస్వభావములో నంతశ్చైతన్య మన్నిటికంటె నెక్కువ భాగము నాక్రమించుకొన్నది. సత్యమును, మరియు, మానవునిబాహ్య చర్యలను, నిర్వచించగల గోప్యమగు ప్రాణశక్తుల, నిలయముల రహస్య మంతశ్చైతన్యమందున్నవనుట సత్యము. అయితే, "ఫ్రూడ్"

దొరగారి ఆత్మతత్వవిభజనశాస్త్రములో, నథశ్చైతన్యములోని, నికృష్ట ప్రాణతత్వమే, ప్రధానస్థానమలంకరించినది. ఈ అథశ్చేతనము అంతశ్చైతన్యపూర్ణస్వరూపములో, పరిమితిగల నికృష్టాంశముగనున్నది. బాహ్యపురుషునికి వెనుక నాధారభూతముగ నంతరాత్మ విశేషముగ నున్నది. అట్టియంతరాత్మలో, బాహ్యమనస్సుకు వెనుక. మిక్కిలి శక్తివంతమైన మహామనస్సు కలదు. బాహ్యప్రాణమువెనుక, మిక్కిలి బలసంపన్నమైన మహాప్రాణము కలదు. బాహ్యశరీరము వెనుక, మిక్కిలిస్వేచ్ఛతోకూడిన సూక్ష్మభౌతికచైతన్యము కలదు. ఈ మహామనః ప్రాణభౌతికముల, కూర్ధ్వముననున్న పరాచైతన్యమునకు, వీని కథోభాగముననున్న అథశ్చేతనమునకు, నీ యంతరాత్మ వికసితముకాగలదు, నీ స్వభావమును పారిశుద్ధమొనర్చుటకును, పరివర్తనచేయుటకును, నీవీపరాచైతన్యవిశేషభూమికల కుద్గమించి వానికి వికసితమొనర్చుకొని, వానిమూలమున నీ బాహ్యాంతరసత్తలను మార్పుజేసికొనుము. ఇట్టికర్తవ్యమందుకూడ, ఒడుదుడుకులులేక, జాగరూకతగల్గి, గురువులమార్గదర్శకత్వము ననువర్తించుచు, సతతము సక్రమమైన దృష్టిని నవలంబింపుము. ఇందుకు, వ్యతిరేకముగా నీ వనువర్తించిన, నజ్ఞానముతోను, బలహీనతతోను కూడుకొనిన నీ స్వభావపుదట్టము, క్రిందికవతరింపజేయబడు శక్తులబలమును భరింపజాలదు. అథశ్చేతనములోని నికృష్టభాగములను మేల్కొల్పుటకు, నీవు ప్రథమములో ప్రారంభించినయెడల, దానిలో నిమిడియున్న అంధకారమును, మాలిన్యమును ప్రకోపింపజేసి కష్టములపాలగుదువు. ప్రథమములో నీవు

నీ మహామనఃప్రాణములను, నూర్ధ్వతేజశ్శక్తులమూలమున, బలసమన్వితముగను, అచంచలముగను జేయుము. తదుపరి అథశ్చేతనమును నిరపాయముగ మేల్కొల్పగలుగుదువు. మరియు, దానిని జయప్రదముగ పరివర్తనముజేయుట కాశించగలవు.

.

అనుభవమూలమున, విషయములనుండి విముక్తిబడయుమార్గము మహాప్రమాదకరమైనది. ఈ మార్గములో, విముక్తిబడయుటకు మారుగా, బోనులోజిక్కిన మూషికముచందమున, మిక్కిలి లోతైన అడుసులో దిగబడుదువు. ఈ పద్ధతి, మన స్తత్త్వమునకు చెందిన రెండు సూత్రములపైన నాధారపడియున్నది. మొదటి సూత్రమే మన— ఉద్దేశపూర్వకమైన లాలసత్వము. ఈ సూత్రము కొందరిపట్లనే సత్యదాయకముగనున్నది. విచారముచేగాని, లేక, బహిష్కరణసాధనచేగాని, విషయవాంఛలనుండి విముక్తిబడయజాలనివాడును, మరియు స్వభావములో విషయవాంచను బలవత్తరముగ కలిగినవాడును, మామూలు జీవితమున కగత్యముగ మరలిపోవుట సంభవించును. నూతన మనోబుద్ధుల నవలంబించి, మామూలుజీవితములోని విషయములననుభవించి, యా విషయముల నిజతత్త్వమును కనుగొని, యావిషయాటంకములనుండి విముక్తిబడసి యాధ్యాత్మికజీవితమునకు మరలివచ్చును. ఇట్టి బుద్ధిపూర్వకమైన లాలసత్వము, కొన్నిసందర్భములం దపరిత్యాజ్యమైనను, సామాన్యముగ మహాప్రమాదకరమని చెప్పుటలో సందియము లేదు. భగవత్సాక్షాత్కారముకొరకు, తీవ్రముగ పరితపించు మనోబుద్ధులుగల

వానికే, యిట్టి బుద్ధిపూర్వకమైన లాలసత్వము, వైరాగ్యమును, విషయములందు హేయభావమును జనింపజేయును.

ఈ యనుభవపద్ధతి కాధారమైన రెండవసూత్రము జనసామాన్యమున కనువర్తించుచున్నది. నీవు నీ సత్తలోనుండి దేనినైనను బహిష్కరించుటకు పూర్వము దాని తత్వమును, మఱియు నీ స్వభావ ప్రవర్తనలో దాని స్థానమును చేష్టలను, నీవు గుర్తెరుంగవలయును. ఆటుతర్వాత, నా చేష్టలపవ్యవృత్తులైన వానిని బహిష్కరించుటకుగాని, లేక అవి పశ్చాత్తర వికారరూపములైన వానిని పరిపాన మొనర్చుటకు గాని వీలగును. ఇట్టి పరివర్తన విధానమునే ఆధునికాత్మతత్వ పరిశోధకుడు, అసంపూర్ణ జ్ఞానముకల్గి, తెలిసీ తెలియని మార్గముల నన్వేషించుచున్నాడు. నికృష్టప్రవృత్తుల తత్వమును తెలిసికొనుటకును, వానిని పరిహరించుటకును మన సంపూర్ణ ప్రజ్ఞాయుక్తమైన చైతన్యములోనికి నా నికృష్టప్రవృత్తులను ప్రకోపింపజేయుపద్ధతిని తప్పనిసరిగ నభ్యసింపవలసియున్నది. ఎందుకన, నట్టి పద్ధతిని నవలంబింపని యెడల సంపూర్ణమైన మార్పును బొందజాలవు అయితే, మార్పు కాదగిన నికృష్టాభిరుచిని జయప్రదముగ నెదుర్కొనగలుగు విశేష తేజశ్శక్తులు నీలో వర్తించుచున్నప్పుడే యిట్టి పద్ధతి లాభకరమగును. పలువురనుభవమును మిషజేసికొని నికృష్టప్రవృత్తులను ప్రజ్వరింపజేసి వానిని విరసించుటకు మారుగా సంతోషముగా నామోదించుచు నట్టి క్రీడలలో పాల్గొనుటను సమర్థించుచు, విష్ణుతో వెల్లాటమని గుర్తె

రుంగక, వానిలోనే కలకాలము నోలలాడుచుందురు. ఇట్టివారు ఆ నికృష్టప్రవృత్తులనుండి విముక్తిబొందవలెనని తలచినప్పుడు చేయుప్రయత్నములు, తేనెలోబడిన ఈగప్రయత్నముల చందమగును. ఘోరమగుపోరాటముచేగాని, లేక దైవానుగ్రహముచేగాని విముక్తి బడయజాలడు. కొందరు, కామోన్మాదమువల్లను, మరికొంద రజ్ఞానమువల్లను నీ అడుసులోనికి దుముకుదురు. అయితే యోగములో ప్రాపంచిక జీవితములో నున్నట్లే అజ్ఞానమును సరియైన సమాధానముగ ప్ర కృ తి ఆమోదించదు. అజ్ఞానభూయిష్ఠమైన స్వభావాక్షర్యలను తెలిసీ తెలియని విధానములతో ననుసందించుట ప్రమాదకరమగును. అందులో విశేషముగ అథశ్చేతనములో నికృష్టప్రాణమును, దాని చేష్టలును, నన్నిటికంటెను మహామూర్ఖమైన పట్టుదలగలిగి నిర్హేతువుగను, ప్రమాదముగను, మాటిమాటికి సంభవించుచుండును. ఇట్టి నికృష్టప్రాణమును యుక్తతరుణము రాకమునుపే ప్రకోపింపజేసిన నది నీ జ్ఞానయుక్తమైన భాగములను దూషితముజేసి మనఃప్రాణతత్వములను గూడ హేయభావములతో నింపి మలినపరచి విషతుల్యము జేయును. కనుక, ఉత్కృష్టానుభవములతో ప్రారంభించవలయును గాని నికృష్టానుభూతులతో మొదలిడరాదు. ఉత్కృష్టానుభవములచే దివ్యస్వభావమునకు చెందిన, స్థిరతను, తేజమును, పవిత్రతను బలమును, ప్రజ్ఞాయుక్తమైన సత్తాంశములలోనికి నవతరింపజేయవలయును, ఇట్టి లక్షణములుగల, స్వభావము నీలో భద్రముగ నెలకొనినపిమ్మటనే అథశ్చేతనములో దాగియున్న నికృష్టాంశములను నిరపాయముగ ప్రకో

పింపజేపి దివ్యజ్ఞానతేజశ్శక్తుల బలములచే వానిని జయప్రదముగ తును మాడగలవు. దివ్యజ్ఞానతేజశ్శక్తుల నీ వవతరింపజేయు ప్రయత్నములో కూడ నీ నికృష్టప్రాణము దానంతటది అడ్డుతగులుచు, దానినుండి విముక్తి బొందుటకు వలయునంత ననుభవమును నీకొసంగుచుండును. అయితే యిట్టిపరిస్థితులందు విశేషమైన మార్గదర్శకత్వము నీ యంతరంగమందు నున్నందున వీని నుపద్రవములేకయే యెదుర్కొనగలవు.



ఆత్మతత్వవిభాగశాస్త్రజ్ఞులు గ్రుడ్డివెలుగువలె నున్న అల్పజ్ఞానము మాత్రమే కల్గి అట్టి స్వల్పజ్ఞానముచే వారొనరించు ఆధ్యాత్మికాను భవముల విమర్శన నాదృష్టిలో గణుతికెక్కదగినదికాదు. అయినను, సంపూర్ణజ్ఞానముకంటె తెలిసీతెలియని జ్ఞానము నిజమైన సత్యాన్వేష ణమునకు, గొప్పఆటంకముగనున్నందున, దీనిని విమర్శింపకతప్పదు. బాలురు ఓనమాలు ఆద్యంతములు నేర్చుకొనుటకుమారుగ ఓనమాల యొక్క సంగ్రహమును మాత్రమే నేర్చుకొను పద్ధతినే ఆధునికాత్మ తత్వవిభాగశాస్త్రజ్ఞు లవలంబించుచున్నారు. అథశ్చేతనము గురించియు, అంతర్భూత విశేషమగు నహముగురించియు, వీరికి తెలిసిన తొలి పలుకులను జోడించి యట్టి పలుకులు సంపూర్ణగ్రంథములని భావిం చుచు ప్రగల్భములు పలుకుచున్నారు. నికృష్టభాగముల తత్వవిమర్శ నచే నుత్కృష్టభాగముల తత్వమును నిశ్చయించుచున్నారు. అయితే,

యీ నికృష్టభాగముల మూల మూర్ధ్వమందున్నదను పరిజ్ఞానము వీరికి లేదు, (ఉపరిబుధ్మాయేషన్). అన్నిటికాధారభూతమైనది పరాచైతన్యముకాని అథశ్చేతనముకాదు. కమలోద్భవమునకు కారణమైనట్టి బురదమట్టి తత్వపరిశీలనచే కమలముయొక్క తత్వమును నిర్ణయింపజాలవు. ఈ కమలమునకు మాతృప్రాయమైన దివ్యాది కమలమూర్ధ్వమునందు దేదీప్యమానమైన వెలుగులో శాశ్వతముగ విరాజిల్లుచున్నది. ఈ ఊర్ధ్వకమలముయొక్క రహస్యమును గుర్తెరింగినప్పుడే యీపృథివీ కమలములోని రహస్యమును గుర్తెరుంగగలవు. ఈ ఆత్మతత్వవిభాగ శాస్త్రజ్ఞులు పరిశోధన నిమిత్తము తమయిష్టానుసారము నిర్ణీతము జేసికొనిన యంశములు మిక్కిలి యంధకారమయముగను, సంకుచితముగను నున్నవి. వస్తువుల భాగమును చక్కగా విమర్శించుటకు పూర్వమే ఆవస్తుతత్వమును సమగ్రముగ ప్రథమములోనే తప్పక తెలిసికొని తీరవలయును. నికృష్టమును చక్కగ నర్థము చేసికొనుటకు నుత్కృష్టమును ప్రథమములో నన్వయమునకు తెచ్చుకొనుటగత్యము. ఇట్టి జ్ఞానమును ప్రసాదించగల పరమోత్కృష్టమైన యాత్మతత్వశాస్త్రము భావికాలమున నవతరించుటకు యుక్తతరుణము కొరకు వేచియున్నది. అప్పు డీ యంధకారమయమైన శాస్త్రమును సూర్యోదయముచే చీకట్లు అంతర్ధాన మగున ట్లంతర్ధాన మగును.

*
* *

మెలకువలేని నిద్ర, సామాన్యముగ చైతన్యమును క్రుంగజేయును. ఎందుకన, యిట్టినిద్రయొక్క తావలమధశ్చేతనమందున్నది, నిద్రావస్థయందు జాగ్రదవస్థను పెంపొందజేయుటే దీనికి శాశ్వతమైన తరుణోపాయము. అట్టిది సిద్ధించువరకు మెలకువకలిగినపుడెల్ల చైతన్యము తిరిగి క్రుంగకుండునటుల ప్రతిక్రియలుకల్గి, మైమరచి నిద్రించురాత్రుళ్ళను సన్నంబులుచేయుము. ఒక నిర్దిష్టమైన ప్రయత్నము, మరియు శిక్షణలేనిదే యిట్టిది చేకూరదు. ఇట్టిది చేకూరుటకు కొంతకాలము పట్టును. కొన్ని సందర్భములందు దీర్ఘకాలము కూడ పట్టును. తక్షణమే ఫలసిద్ధికాలేదని ప్రయత్నములు విడువరాదు.



పగటికాలమందు జాగ్రదవస్థలో సాధనమూలమున చేకూరిన యున్నత చైతన్యభూమికలు రాత్రివేళలందు నిద్రావస్థతో దిగుమొగము దాల్చి క్రిందికి క్రుంగుచున్నవి. అయితే, నిద్రావస్థలో నున్నతానుభవములు సంప్రాప్తమైన యెడలను, లేక, అధశ్చేతనముయొక్క తమఃప్రధానమైన యీడ్పులను ప్రతిఘటించగల యోగ చైతన్యబలము నీ భౌతికములో నున్నయెడలను, నిద్రావస్థలో నీ చైతన్యము క్రుంగజాలదు. సాధారణమైన నిద్రావస్థయందు, శరీరములోని చైతన్యము, అధశ్చేతన భౌతికముగ నున్నది. ఈ అధశ్చేతన భౌతికమునకు, సత్తలోని ఇతర చైతన్యాంశముల కున్నటువంటి మెలకువగాని, జ్ఞానము

కాని లేదు. నిద్రావస్థయందు అథశ్చేతనము తప్ప, ఇతర చైతన్యాంశ ములు వెనుక నిలబడియుండును. మరియు, కొన్ని చైతన్యాంశము లితర లోకములలో సంచారముజేసి యనుభవములు పొందును. స్వప్న ములలో చిత్రింపబడిన విషయము లీయనుభవములే. నీవు నికృష్ట ప్రదేశములలో సంచారము చేసినట్లు కలిగిన స్వప్నము నీలో మాలిన్య మున్నట్లు సూచింపజాలదు. ప్రతివ్యక్తియు ప్రాణలోకములో సంచా రము చేయు పగిది, నీవుకూడ నాలోకములో సంచరించి యున్నావు. ఆ ప్రాణలోకము నికృష్ట ప్రదేశములతోను, ననుభవములతోను నిండి యున్నది. నీ వీ ప్రాణలోకముల కేగకుండ నాపుదల చేయజాలవు. అయితే, యీ యూర్ధ్వభౌతిక కక్ష్యలలో, నీకాధిపత్యము కలుగువరకు. రక్షణాసమేతుడవై యాకక్ష్యల లోనికి ప్రవేశింపుము. నీవు నిద్రించు టకు పూర్వము, మాతను స్మరించుకొని, ఆమె శక్తి కుపిష్ఠులడవైన యీ రక్షణను బడయగలవు. నీ వెంత అతిశయాతిశయముగ, యీ యభ్యాసమును జయప్రదముగ చేయగ్గలుదువో, అంత యెక్కువగ మాత రక్షణను బడయగలవు.



ఈ స్వప్నములు కేవలము స్వప్నములు మాత్రము గావు. ఇవ న్నియు నథశ్చేతనముయొక్క నిర్మాణములు కాని, లేక, సహేతుకమైన నిర్మాణములు గాని కావు. వీనిలో పెక్కులు, నిద్రావస్థయందు ప్రాణి

కక్ష్యలో కల్గు అనుభవముల చిత్తరువులుగను, మరికొన్ని, సూక్ష్మ భౌతిక ప్రపంచములోని సంఘటనములుగను నున్నవి. స్థూల ప్రపంచ జీవితములోని సంఘటనములయొక్కయు, మనుజుల యొక్కయు, ప్రతి రూపములను, కొన్ని వ్యత్యస్తములతో, సూక్ష్మప్రపంచములందు స్వప్న ములో తటస్థించుచుండును. అయితే, స్థూలప్రపంచమునకు సంబంధిం చనివారిని, లేక, స్థూల జీవితముతో పరిచయము లేనివారినిగూడ సందర్శించుచుందువు.

జాగ్రదవస్థలో నున్నప్పుడు, నీ స్వభావములోని కొంత భాగ మును, మరియు, కొన్ని చర్యలను మాత్రమే, యెఱుక కలిగియున్నావు. జాగ్రదవస్థ కతీతమైయున్న, చైతన్యభూమికలను, నిద్రావస్థయందు విపివిగా చూడగలవు—జాగ్రదవస్థకు మరుగై యున్న మహామనఃప్రాణతత్వ ములను, లేక, సూక్ష్మభౌతిక ప్రపంచమును, జాగ్రదవస్థలో వ్యక్తము గాక, అధశ్చేతనములో నంతర్గతమైయున్న విషయములను చూడ గలవు. ఈ యంధకారమయ ప్రదేశములను తేజోవంతము చేయవలెను. లేనియెడల, ప్రకృతిని మార్పజాలవు. ఈ ప్రాణతత్వముయొక్క, లేక, అధశ్చేతనముయొక్క స్వప్నములచే, నీవు తబ్బిబ్బు పడరాదు. ఈ రెండు లోకానుభవములే స్వప్నానుభవములుగ నున్నవి. వీని నుండి విముక్తి బడయుటకును, దివ్య సత్యమును తప్ప తదితరములైన వానివి బహిష్కరించుటకును ప్రజ్ఞాయుక్తుడవై యుండుట కాకాంక్షించుము. జాగ్రదవస్థయందు, నీ వెంత యెక్కువగ, దివ్యసత్యానుభవమునకు పరి

తపించుచు. తదితరములైన వానిని బహిష్కరించుచు నుందువో, అంత యెక్కువగ ఈ నికృష్ట స్వప్నమాలిన్యమునుండి విముక్తి బడయగలవు.

నీవు వివరించిన స్వప్నములు, ప్రాణకక్ష్యకు చెందిన చిహ్నముల చిత్రించు స్వప్నములుగ నున్నవి. బాహ్యస్వభావములోగాని, లేక, అంతర్గత స్వభావములోగాని, కలిగిన మార్పులను, లేక, కలుగబోవు మార్పులను, లేక, జరిగిన సంఘటనములను జరుగబోవు సంఘటనములను, అనుభవించిన విషయములను, మరియు వేనినైనను నీ స్వప్నములు చిత్రించవచ్చును.

స్వప్నములో కలిగిన భీతి పిరికితనమును సూచించుచున్నది. ఆ పిరికితనము జ్ఞానయుక్తమైన మనస్సుకుగాని లేక మహాప్రాణమునకు గాని చెందినదికాదు. అది నికృష్ట ప్రాణస్వభావమునకు చెందినది, ఈ భాగము తుచ్ఛమైనట్లును, నీచమైనట్లును, తనంతకుతా నెల్లప్పుడుభావించుకొనుచుండును. విశేషచైతన్యముచే ముంచివేయ బడుదునని భయపడుచుండును. విశేష చైతన్యముయొక్క ప్రథమాను సంధానము కంపమును భీభత్సమును కలుగజేయును.

ఈ విధమైన స్వప్నములు ప్రాణకక్ష్యయందు రూపముల దాల్చుచున్నవి. అరుదుగా మనఃకక్ష్యయందును కల్గును. ఒకప్పు డీ స్వప్నములు నీ మనఃప్రాణ నిర్మితములుగను, మరియొకప్పుడు అన్యమునో

నిర్మాణములు నీలో దాల్చు ప్రతిబింబములుగను, మరికొన్ని వేళలందు మనుష్యేతర శక్తుల కృత్యములుగను, లేక యితరకక్ష్యలయొక్క భూతకృత్యములుగా నుండును. ఈ స్వప్నములు నిజములుకావు. స్థూల ప్రపంచములో నీ స్వప్నములు వాస్తవముగ పరిణమించవలసిన అగత్యము లేదు. అయితే భౌతికము ననుసంధించు తలంపుతో నా స్వప్నములకు రూపము లియ్యబడిన యెడల నవి సంఘటనములుగా పరిణమించును —— ఎందుకన నవి అంతర్, లేక బాహ్యసూచకములుగ నున్నవి. వీనియెడల నవలంబించవలసిన సక్రమ విధాన మే మన, వానిని తిలకించుచు, నన్వయమునకు తెచ్చుకొనుట. మరియు నవి ప్రతిపక్షశక్తులనుండి యుద్భవించిన యెడల వానిని బహిష్కరించుట.

పైనజెప్పిన గుణగణములులేని యితర స్వప్నములున్నవి. ఇతర కక్ష్యలలో, లేక ఇతరప్రపంచములలో, మన పరిస్థితులకు భిన్నములైన పరిస్థితులలో వాస్తవముగ సంభవించువానియొక్క ప్రతిరూపములుగ కొన్నిస్వప్నములున్నవి. కొన్నిస్వప్నములు నీ స్వభావములో కెలుకైన ప్రవృత్తులను, యెలుకగాని ప్రవృత్తులను సూచించునవిగా నున్నవి. కొన్ని నీ యథశ్చేతనములో నిద్రించుచున్న విషయములను, లేక మెలకువతో తిరుగాడు విషయములను, సూచించుచున్నవి. ఈ నానావిధములైన విషయములనుండి విశేషచైతన్యములోనికి ననుగమించునపుడు, విముక్తిబడయగలవు. ఈ స్వప్నముల నన్వయించు నేర్పు

నీకు కలిగిన వీనిమూలమున మన స్వభావములో నంతర్హితమైయున్న పెక్కు రహస్యములను తెలియగలవు.



నిద్రను నిరోధించు ప్రయత్నము సక్రమమైన పద్ధతి కానేరదు. ఉపయుక్తమైన నిద్రను నిరోధించుటవల్ల శరీరము తమోభావమును పొందుచున్నది. మరియు జాగ్రదవస్థలో వలయునంత నేకాగ్రత నల్పుటకు శరీరము శక్తిహీనత కలిగియుండును. నిద్రను పరివర్తనముచేయుట సక్రమ విధానముకాని దానిని నిరోధించుటకాదు. అందులో విశేషముగ నిద్రావస్థయందు జాగ్రదవస్థను పెంపొందజేయుటకు నేర్పువహించవలెను. ఇట్టినేర్పు సమకూరిన నిద్రయంతశ్చైతన్యవిధానముగ మార్పబడి జాగ్రదవస్థలో సాధనను సాధించినట్లే నిద్రలోకూడ సాధనను సాధించగలవు. మరియు భౌతికచైతన్యేతర భూమికలలోనికి ప్రవేశించి, యుపయోగకరంబులైన పెక్కు యను భవములను పొందగలవు.



నిద్రాస్థానమందు మరియొకదానిని నెలకొల్పజాలవు. అయితే దానిని పరివర్తనముజేయుటకు సాధ్యముకలదు. ఏలనన నిద్రలో ప్రజ్ఞా

యుక్తుడవుకాగలవు. ప్రజ్ఞాయుక్తమైన రాత్రుళ్ళను విశేషకార్యముల కుపయోగించగలవు. అయితే శరీరమునకు వలయునంత విశ్రాంతి నియ్యవలయును. ఎందుకన శరీరవిశ్రాంతికిని ప్రాణ భౌతికశక్తి నూతనరూపముదాల్చుటకును, నిద్రముఖ్యావసరము. సన్యాసభావముతో కొందరు నిద్రాహారములను శరీరమునకొసంగక, నిరాకరించుపద్ధతి యనువర్తనీయముకాదు. అట్లుచేయుట గొప్పపొరబాటు. ఇట్టి విధానము భౌతికాధారమును శిధిలముచేయును. ఒకవేళ యోగశక్తివల్లను, లేక ప్రాణశక్తివల్లను, కృశించు శరీరమును దీర్ఘకాలము క్రియోన్ముఖము చేయుటకు వీలైనను, నిట్టి శక్తులాధారము తొలగిపోవు కాలము తప్పక తటస్థించును, శరీరము సక్రమముగా వర్తించుటకు దాని కుపయుక్తములైనవానిని నొసంగవలెను, ఎక్కువ తక్కువలు లేక వలయునంత నిద్రాహారములు, పరిపాటిగా నుండవలెను. ఆహారమును పేరాశచేగాని జిహ్వాచాపల్యముచేగాని, భుజించరాదు, నిద్ర తమఃప్రధానమైన మొద్దునిద్రకాకూడదు.



తేజోవంతమైన ప్రశాంతముగల నిద్రయు, శరీరమును పులకాంకితముజేయు నిద్రయు, మిక్కిలి యుత్కృష్టమైన నిద్రావస్థలు, అటుగాక మైమరచి నిద్రించిన వేళలు గాఢనిద్రచే మచ్చుచల్లిన చందముగ నుండును. ఇట్టి నిద్రలో, భౌతిక కక్ష్యనుండి మనఃప్రాణ కక్ష్యల

లోనికి గాని, లేక యితర కక్ష్యలలోనికి గాని ప్రవేశింతువు. నీకు సంపూర్తిగా స్మృతిలేనట్లు నుడివియున్నావు. అయితే యది సంపూర్తిగ స్మృతి తప్పిన యవస్థకాదు. నిద్రలో సంభవించిన విషయములను నీవు జ్ఞాపకమునకు మాత్రము తెచ్చుకొనజాలకున్నావు. ఎందుకన నీవు నిద్రనుండి మేల్కొన్నప్పుడు చైతన్యము మారుచున్నది. లేక యది తిరుగుమొగము దాల్చుచున్నది. మనస్సులో గాఢముగ నాటుకొన్న విషయములను నిద్రాంత్యదశలందు సంభవించిన విషయములను తప్ప. మిగిలిన విషయములన్నియు భౌతికచైతన్యము నుండి తిరోధానమై నేమియు సంభవించ నట్లగుపడును, శూన్యముగ నుండును నిద్రలో మరొక శూన్యావస్థకూడ కలదు. అది తమః ప్రధానమైన యవస్థ. ఈ యవస్థ శూన్యమేగాక, మజ్జుతోను, మబ్బుతోను కూడుకొనియుండును.

అథశ్చేతనములోకి గాఢముగాను, కలుకుగాను పోయినప్పుడే యిట్టి శూన్యావస్థ కలుగును. ఇట్టి యథశ్చేతనమను సురంగములో మునిగిపోవుట వాంఛనీయము కాదు. ఇట్టిది చైతన్యమును క్రుంగజేసి మాంద్యమును కలుగజేయును. మరియు విశ్రాంతిని చేకూర్చుటకు మారుగా నలసటను కలుగజేయును. తేజోవంతమైన ప్రశాంతికి విరుద్ధమైనది. నిన్నావేశించిన నిద్ర అర్ధనిద్రకాదు, లేక సాత్త్విక నిద్రకాదు. లేక పీసము నిద్రయు కాదు. అంతశ్చైతన్యములోనికి పోవుటయే యా నిద్రయొక్క తత్వము. ఈ యవస్థయందు నీవు ప్రజ్ఞానము కలిగి యుందువు. అయితే బాహ్యవిషయములు నీకు తెలిచాటు వహించును.

అంతరనుభూతులు నీకు వికసితము లగును. ఈ రెండు నిద్రావస్థలలో గల వ్యత్యాసమును నీవు గమనించవలెను. ఒకటి నిద్ర. రెండవది సమాధి ప్రారంభము. (అయితే నిర్వికల్ప సమాధికాదు.) ఇట్టి యంత ర్ముఖ సంచార మగత్యము, ఎందుకన. మానవునిలో క్రియాసహితమైన మనస్సు బాహ్య విషయములలో. నప్రమేయముగ మునిగి తేలుచున్నది. అంతస్సత్తయందు (అంతర్మనః ప్రాణభౌతికములు) మని యుండుటకు మనస్సు తప్పనిసరిగ నంతర్ముఖము గావలెను. సరియైన శిక్షణవల్ల యంతస్సత్తయందు మనుగడ గలిగియు, బాహ్యవిషయ జ్ఞానమును బడయగలవు. మరియు నీ యిచ్ఛానుసారము బాహ్యాంతర పరిస్థితుల నియమించగలవు. నీవు పొరబాటుగా నిద్రయని పేర్కొనిన సమాధిలో నే విధమున విశేష చైతన్యావరోహణము కలిగియుందువో తద్విధము గనే జాగ్రదవస్థయందుకూడ నట్టి యచంచల స్థిరత్వమును, విశేషచైత న్యావరోహణమును కలిగియుందువు.

*
* *

సాధనకాలము మధ్య శరీరము దప్పి యలసట జెందుటకు పలు విధములైన కారణములు గలవు. (౧) శరీరము జీర్ణించుకొనుటకు మిక్కుటమైన శక్తిని స్వీకరించుటచే నలసట కలుగవచ్చును. ప్రజ్ఞా యుక్తమైన అచలత్వములో, ప్రశాంతమగు విశ్రాంతివి వహించి, ప్రాణ బలముల నుద్ధరించుటకు మాత్రమే శక్తులను స్వీకరించుట ప్రథమ తరుణోపాయము.

(2) సరళత్వము మాంద్యరూపము దాల్చుట వల్లను నలసత్వము వాటిల్లుచున్నది. ఈ మాంద్యము, చైతన్యమును సాధారణ భౌతిక భూమికలలోనికి కృంగజేయును. ఈ భౌతికము త్వరితముగ దన్ని తమస్సును పొందుచున్నది. ఇట్టి తమస్సులో విశ్రమించుటకు మారుగ నిజచైతన్యములోని కనుగమించి యందులో విశ్రమించుటే తరుణోపాయము.

(3) శరీరమునకు మిక్కిలి శ్రమ యిచ్చుటవల్లను యలసట కలుగుచున్నది.—వలసినంత నిద్రను, లేక, విశ్రాంతిని నిరాకరించుట —యోగమునకు శరీరమాధార భూతముగ నున్నది. అయితే దాని శక్తి యిసుకపాతరవలె తరుగునది కాదు. కనుక మితముగ వ్యయమొనర్చవలెను. విశ్వప్రాణశక్తిని స్వీకరించుచు శరీరమును మంచి పరిస్థితిలో నుంచుటకు వీలగును. అయితే యట్టి సాహాయ్యమునకు గూడ పరిమితియున్నది. అభివృద్ధిని పొందవలె నను నాతురతోగూడ యొక విధమైన మోతాదును పాటించవలెను—పరిపాటిగాని అంసత్వముకాదు.



జబ్బు యేదోయొక లోపమును, లేక, యశక్తతను, లేక, భౌతిక స్వభావములో నికృష్ట శక్తుల స్పర్శను సూచించుచున్నది. మరియు నికృష్ట ప్రాణములోగాని, భౌతిక మనస్సులో గాని, యిత

రాంశములలో గాని, సామరస్యము లేకుండుట వల్లను. లేక, యంధ కారము ప్రజ్వలించుట వల్లను జబ్బు కలుగుచున్నది.

నమ్మకము వల్లను, మరియు యోగశక్తివల్లను, లేక, దివ్యశక్తి యవరోహణము వల్లను, జబ్బులనుండి విముక్తిబడుట చక్కని మార్గము. అయితే, యిట్టిది సంపూర్ణముగ సాధ్యము కాదు. ఎందుకన, సంపూర్ణ స్వభావము దివ్యశక్తికి వికసితమై యుండలేదు. లేక యా దివ్యశక్తిని అనువర్తించుటకు నీ స్వభావమునకు శక్తికలిగి యుండలేదు. మనస్సు నమ్మి యనువర్తింప వచ్చును. అయితే నికృష్ట ప్రాణముమ, శరీరమును అనువర్తింపక పోవచ్చును. ఒకవేళ, మనస్సును, ప్రాణ మును, అనువర్తించుటకు సిద్ధముగనున్నను, శరీరము అనువర్తించక పోవచ్చును. లేక పాక్షికముగనైన యనువర్తించును. ఎందుకన, ఒక నిర్దిష్టమగు జబ్బు నుత్పన్నము జేయునట్టి శక్తులకు, ప్రతిపల్కు నల వాటు శరీరమందున్నది. స్వభావముయొక్క భౌతికాంశములలో యల వాటు మొండిపట్టు కలిగియున్నది. ఇట్టి సందర్భములందు భౌతిక చికి త్సలను జేయవచ్చును—ప్రధానమైన చికిత్సగా గాక, దివ్యశక్తి కృషికి సాహాయ్యముగను, లేక భౌతికమునకు నాధారముగను ఉపయోగింప వచ్చును. ఘూతైన చికిత్సలు, లేక, ప్రచండమైన చికిత్సలు తగినవి కావు. శరీరమును తారుమారు చేయకుండ, దాని కుపకరించు చికిత్స లను మాత్రమే చేయవలెను.

*
* *

నికృష్ట స్వభావము వల్లను, లేక ప్రతిపక్ష శక్తుల దాడులవల్లను జబ్బు కలుగుచున్నది. నీ స్వభావములోని యశక్తతను, మరియు నీలో ప్రతిపల్కు లక్షణములను, నీ నికృష్ట శక్తులు పురస్కరించుకొని, నీ పైకి దాడి వెడలును. ఇతర విషయము లెట్లు బాహ్యమునుండి నిన్నను సంధించుచున్నవో యట్లే జబ్బులుకూడ నిన్ననుసంధించుచున్నవి. అట్లవి బాహ్యమునుండి ప్రవేశించుచున్నట్లు నీవు భావించుకో కల్గినప్పుడును, నవి నీ శరీరములోనికి ప్రవేశింపక మునుపే, వానిని పారదోల గల యభ్యాసము, బలము, నీ కలవడినప్పుడును, నీవు జబ్బులనుండి సంపూర్తిగ విముక్తుడవు కాగలవు. ఆంతర్యమునుండి, యవి యుద్గమించుచున్నట్లు నీకు గోచరించుటకు, కారణమేమన, నవి నీ యథశ్చేతనములోనికి జొరబడక మునుపే, నీవు వానిని గుర్తించి యుండలేదు. అథశ్చేతనములోని కొక్కతూరి చొచ్చుకొనిన యెడల, నేశక్తి దానిని యధశ్చేతనములోని కీడ్చుకొనివచ్చినదో, ఆ శక్తియే, త్వరితముగనో, తడవుగనో దానిని ప్రకోపింపజేసి నీమీదికి దాడిసల్పును. అవి నీలోకి ప్రవేశించిన మరుక్షణమే, వానియుపలంభము నీకు కల్గుటకు కారణ మేమన, నవి యధశ్చేతన మూలమున గాక, ప్రత్యక్షముగ సంభవించినను, నవి బాహ్యమందున్నప్పుడే వానిని గుర్తెరుంగు శక్తి నీకులేకుండినది. తరుచుగ నివి యీ విధముననే సంభవించుచుండును. మనకు ముఖ్య రక్షణా కవచమైన సూక్ష్మ ప్రాణశరీరములోనికి, నభిముఖముగాగాని, పార్శ్వములనుండి గాని ప్రవేశించును. అవి సూలశరీరములోని కెగ బ్రాకక మునుపే, వానిని సూక్ష్మ శరీరమునందే యరికట్టవచ్చును.

అప్పుడు నీకు రోగముయొక్క తీక్షణము పూర్తిగ వ్యాపించక, స్వల్ప జ్వరముగనో, పడిసెముగనో పరిణమించును. సూక్ష్మశరీరములోనికి చొచ్చుకొనక మునుపే, దాని నరికట్టినయెడలను లేక సూక్ష్మశరీరమే తనంతకు తాను దానిని నిరోధించుటకు బలిష్ఠమై యున్నయెడలను జబ్బు సంభవింపనేరదు. స్థూలరూపమైన సాధక బాధకములు కలిగింప జాలదు.

ఆంతరమునుండి జబ్బులమీద శక్తిని ప్రయోగించి, నివారణ తప్పక పొందవచ్చును. అయితే, భౌతికములో మాంద్యనిరోధము పెచ్చుగనున్నందున, నిట్టి నివారణోపాయము సులభసాధ్యము కాదు. విసుగుచెందని పట్టుదల యత్యవసరము. ప్రథమములో, నీకు సంపూర్తిగ పతనముకూడ వాటిల్లును. లేక, రోగముయొక్క లక్షణములు తీవ్రరూపముగూడ దాల్చవచ్చును. అంతస్సాధనలచే, నప్పుడప్పుడు సంభవించు జబ్బులనుండి విముక్తిజడయుట యతి సులభము. భావి కాలమునగూడ నట్టి జబ్బులకు లోనుగాకుండ, శరీరమును వజ్రమయము జేయుట బహుకష్టతరము. అప్పుడప్పుడు సంభవించు వ్యాధుల నివారణకంటె పురాణవ్యాధుల నివారణమే కష్టతరము. శరీరవశీకరణలో లోపము లున్నంతవరకు, నంతశ్శక్తి ప్రయోగములో నిట్టి కష్టములు, లోపములు తప్పవు. అంతశ్శక్తిచే, జబ్బు బలపడకుండ నీవు సాధించ గల్గిన నదియే కొంత విశేషమని భావింపుము. అట్టి శక్తిని నభ్యాస

ముచే బలసంపన్నము జేసిన నది జబ్బును సంపూర్తిగ నివారించగల్గును. అట్టి శక్తి నీలో లేనంతవరకు భౌతిక చికిత్సల విడనాడకుము.

అంతశ్శక్తికి నీ చైతన్య మనుకూలముగ ప్రవర్తించని యెడల ఔషధముల నుపయోగింపుము. తఱచుగ భౌతిక చైతన్యములోని కొంత భాగ మనుకూలముగ ప్రవర్తించదు. ప్రజ్ఞాయుక్తమైన మనఃప్రాణ భౌతికములు, విముక్తి నొసంగు నంతశ్శక్తి కనుకూలముగ ప్రవర్తించి నను, నథశ్చేతన మట్టి శక్తి మార్గములో నడ్డుతగులుచుండును. అథశ్చేతనముగూడ ననుకూలముగ ప్రవర్తించిన, నట్టిశక్తి స్పర్శ స్వల్ప మాత్రమైనను జబ్బు నివారణ యగుటయేగాక తదుపరి యట్టిజబ్బు సంభవించు టసంభవము.

జబ్బులను గురించి నీవు నుడువు సిద్ధాంతము ప్రమాదకర మైనది. ఎందుకన, రోగములు బహిష్కరింపవలసిన విషయములు కాని సంతోషముతో ననుభవించవలసిన విషయములు కావు. జబ్బును ప్రీతి పూర్వకముగ ననుభవించునది ఏదో కొంతభాగము సత్తలో నున్నది. వ్యాధిమూలమున కల్గు బాధలను, తదితర బాధలవలెనే ఆనందరూపముగ మార్చుటకు సాధ్యముకలదు. ఎందుకన, సుఖదుఃఖములు రెండును ఆది యానందముయొక్క వికారరూపములైనందున, దుఃఖమును సుఖము గాను, సుఖమును దుఃఖముగాను లేక, రెంటిని, మాతృరూపమైన యాది యానంద రూపముగా నుత్కృష్టపరచి మార్పుజేయుటకు సాధ్యమగును.

జబ్బులు సంభవించినపుడు సహనము కల్గి ప్రశాంతముతో స్తిమితముగ నుండవలె ననువిషయము వాస్తవము. ఎందుకన జీవయాత్రలో, నీవు దాని ననుభవించి తీరవలసిన సంఘటనముగ నున్నది. అయితే, దాని నంగీకరించి, ప్రీతిపూర్వకముగ ననుభవించుచున్నచో దాని మనుగడకు నీవు సాహాయ్య మిడుదువు. ఎందుకన, కామమోహములు, కోపతాపములు, ఈర్ష్యాసూయలు నే విధమున ప్రాణతత్వముయొక్క వికారరూపములో; పొరబాటు, పక్షపాతము, అనృతము లేవిధమున మనస్తత్వముయొక్క వికారరూపములో, తద్విధముగనే జబ్బులుకూడ భౌతిక స్వభావముయొక్క వికార రూపములుగ నున్నవి. ఈ వికారముల నన్నింటిని నామూలాగ్రముగ నరికిపేయవలెను. వీనిని మటుమాయ మొనర్చుటకు బహిష్కరణ విధానమే కర్తవ్యము, అంగీకార పద్ధతిందులకు వ్యతిరేకమైన ఫలముల నొసఁగును.

వ్యాధులన్నియు స్థూలశరీరములోనికి ప్రవేశించకమునుపు రక్తనాళగోళములోనికిగాని, సూక్ష్మశరీరములోనికిగాని. ప్రథమములో ప్రవేశించును. సూక్ష్మశరీరముయొక్క యెఱుక నీకు కల్గిన స్థూలశరీరములోనికి వ్యాధివ్యాపించకుండ దానినరికట్టుటకు నీకు సాధ్యమగును. అయితే, నీకు తెలియకుండగనో, లేక, నీవు నిద్రావస్థలోనున్నప్పుడో, లేక, అథశ్చేతన మూలముననో, లేక నీవు ఏమరుపాటుననున్నప్పుడో, యది నీలోనికి ప్రవేశింపవచ్చును. అప్పుడు, నీశరీరముపైన నీకింతకు పూర్వమే స్వాధీనముగల స్థానమునుండి దానిని తునుమాడుము. ఇట్టి

అంతస్సాధనలచేకల్గు నాత్మరక్షణ బలమగుకొలది నీశరీరము సాధ్యమైనంతవరకు, సంపూర్తిగ జబ్బులనుండి విముక్తిపొందును. యోగీశ్వరు లనేకు లిట్టిసిద్ధిని గాంచియున్నారు. "సాధ్యమైనంతవరకు" ననగా నిశ్శేషముగానని యన్వయించు కొనవద్దు. నిశ్శేషమైనవిముక్తి విజ్ఞానమయపు మార్పుసంభవించిన తదుపరియే కల్గును. ఎందుకన, విజ్ఞానమయభూమికకధోభాగమున కల్గుఫలము పలువిధములైన శక్తుల మధ్య ప్రవర్తించు పరాశక్తిచే నియ్యబడు ఫలితముగనున్నది. విజ్ఞానమయపు భూమికలో నిట్టికార్యకలాపము స్వభావసిద్ధమైయుండును. విజ్ఞానమయపు శరీరముయొక్క జబ్బులవిముక్తి, స్వతఃసిద్ధముగను జన్యమైనదిగను నుండును.

మనోభూమికయందును, తదితర నికృష్ట భూమికలందును, ప్రవర్తించు యోగశక్తికిని, విజ్ఞానమయపు భూమికలో ప్రవర్తించు యోగశక్తికిని తారతమ్యముకలదు. మనశ్శరీరముల చైతన్యములో యోగశక్తియార్జించి పొందినవిశేషము, విజ్ఞానమయభూమికలో, స్వతస్సిద్ధముగనుండును. అట్టిది సాధనఫలస్థితిపై యాధారపడక, స్వభావసిద్ధమై యుండును,—అట్టిది స్వయంభువుగను, నఖండముగను నుండును.

సమాప్తి

నను, లేక యా విశేషచేతనము యొక్క చదునైన యూర్ధ్
కలను నీవు పరిగ్రహించగలవు. ఆ విశేషచేతనకు బునాదియైన
నిశ్చలత, నీరవత, శాంత్యాదుల మొదట పొందగలు
తరువాత నీ వివిధ కక్ష్యలలోనికి, గేవలము నీ శరీరము లో
ఆ నిశ్చల నీరవత శాంత్యాదు లవరోహించును. శక్తి తేజము
రాగలుగును. నాభి, దానికి గ్రిందనుండు చక్రములు ప్రాణ
లకు సంబంధించినవి. పరాశక్తి యంశము క్వచిత్తుగా
బ్రసరించియుండును.

# II

## శ్రద్ధ - ఆకాంక్ష - సమర్పణ

దేనినీ ఆకాంక్షింపక దివ్యసత్యాన్వేషణ భావోపలబ్ధుల మాత్రమే యాకాంక్షింపుము. అట్టి యావేశమునకు జీవితమును సంపూర్ణముగా సమర్పణ మొనర్పవలసినదిగా ఈ యోగము శాసించుచున్నది. సత్యాన్వేషణమున కేమాత్ర ముపకరించని బాహ్యాశయ వృత్తులకు భగవంతునికి మధ్య నీ జీవితమును విభాగించుట నిషేధము. అట్టిది యిసుమంత యున్నను యోగములో నుత్తీర్ణత యసంభవము. ఆధ్యాత్మిక జీవితమునకు నిన్ను నీవు పూర్ణముగా నర్పించుకొనుము. నీవు యోగములో విజయము పొందవలెనన్న మనోసంజని తేచ్ఛాద్వేషముల పట్ల నీ మమకారము నీనుండి రాలిపోవలెను. కామనాప్రేరిత వాంఛితాశయములపై ననురాగము నీ నుండి సడలిపోవలెను. "నా సంసారము, నా మిత్రులు, నా దేశము" అను అహంకార మమత్వములు నీ నుండి యంతర్ధానము గావలెను. నీ బాహ్య ప్రవర్తనమంతయు నీచ మనఃప్రాణాశయములనుండి జనించక నీచే నన్వేషింపబడి కనుగొన్న